## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015810

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పాండవాజ్ఞాతవాసము

గ్రంథకర్తలు.

[illegible]మనారాయణకవులు

ప్రకటనకర్త

కందుల గోవింద

సోల్ యేజంటు:

చందా నారాయణసెట్టి,

బుక్కుసెల్లర్, సికింద్రాబాద్ (దక్కన్.)

నాల్గవకూర్పు 2000 ప్రతులు

కాకినాడ.

స్క్రేప్ అండుకోలో., కె. సుబ్బారాయుడుబ్రదర్సు వారివలన
ముద్రింపఁబడిరి.

1928

 [వెల రు 0—12—0

# ఈ నాటకమునందు వచ్చుపాత్రలు

## పురుషులు

ధర్మ, భీమార్జున, నకుల సహదేవులు — పాండవులు

ద్రుపదుఁడు — పాంచాలాధిపతి

బకాసురుఁడు — రాక్షసుఁడు

ధృతరాష్ట్రుఁడు — }
దుర్యోధనుఁడు — } కౌరవులు
దుశ్శాసనుఁడు — }

శకుని — దుర్యోధనుని మేనమామ

విదురుఁడు — కౌరవులమంత్రి

భీష్ముఁడు — కురుపాండవపితామహుఁడు

ద్రోణుఁడు — అస్త్రగురుఁడు

అశ్వత్థామ — ద్రోణునికుమారుఁడు

కృపాచార్యులు — ద్రోణుని బావమఱఁది

ఇంద్రుఁడు — అమరలోకనాథుఁడు

సైంధవుఁడు — దుర్యోధనుని బావమఱఁది

విరటుఁడు — మత్స్యరాజు

కీచకుఁడు — " బావమఱఁది

సుశర్మ — దుర్యోధనుని పక్షమువాఁడు

## స్త్రీలు

కుంతి — పాండవజనని

ద్రౌపది — పాండవపత్ని

హిడింబ — భీముని వరించిన దైత్యస్త్రీ

ఇంకను సందర్భము ననుసరించి ఏకచక్రపురమున బ్రాహ్మణ దంపతులు, సేవకులు, మొదలగు వారు వత్తురు.



# పాండవాజ్ఞాతవాసము



## ప్రథమాంకము.

రంగము:—[కాంపిల్యనగరప్రాంతభూమి—ప్రవేశము:

ద్రోణుఁడును, పాండవులును]

ధర్మ—(ద్రోణునిఁజూచి) గురువర్యా! ద్రుపదునిఁ గూర్చి చెప్పఁదలఁచి మఱచి పోయిరి.

ద్రోణు—అవును. మఱచితిని. (ఇంచుకయూరకుండి) పాంచాలపతి యగు ద్రుపదుఁడును, నేనును నగ్నివేశ్యుఁ డనుమునియొద్ద విద్యనభ్యసించితిమి.

తే. గీ. ఈశరీరముల్ రెండౌచు ♦ నెసఁగెఁ గాని
చిత్తమొక్కటియగుచును ♦ జెలఁగ నప్పు
డతఁడు నాపైనఁ జూపిన ♦ యలఘుకరుణ
దరమె వర్ణింప నాకును ♦ ధర్మతనయ.

ధర్మ—మహాత్ముఁడవగునీయెడల నట్లు మైత్రిందగిలియుండుట యాతని పూర్వజన్మసుకృతమే.

ద్రోణు—ఇటువినుము. ఇట్లు మేము విద్యలనభ్యసించుచుండ. నాతఁడొకనాఁడు నన్నుఁజూచి "మిత్రమా! నేను రాజునైయున్నప్పు

డు నీవు తప్పక నాకడ కరుదెంచి, సత్కారముల నందవలయు" నని వచించెను.

అర్జు—ఎంతయు శ్లాఘ్యము.

భీము—బ్రాహ్మణులు రాజులకు దైవసమానులు. అందులో నీతినిక హితుఁడవుగూడ నైయుంటివి.

ద్రోణు—అంతఁ గొన్నాళ్ళకు ద్రుపదుఁడు విద్యఁజాలించి తనరాజ్యమునకరిగి పట్టాభిషిక్తుండయ్యెను. నేనును వివాహమాడి, పుత్రవంతుఁడనై దారిద్ర్యసాగరమున మునుంగుటంజేసి ధనార్జనమునకై బయలుదేరి పరశురాముని సన్నిధికరిగితిని. అమ్మహాత్ముఁడు నన్నుఁజూచి,

తే. గీ. యాచకులకిచ్చినాఁడ ద్ర ♦ వ్యంబునెల్ల
ధాత్రితలము గశ్యపునకు ♦ దానమిడితి
నేమిలాభంబు వడయఁగా ♦ నెంచియిటకు
వచ్చినాఁడవు ననుఁజూడ ♦ భవ్యచరిత.

అయిన. నీశరీరమును, శస్త్రములును మిగిలియున్నవి. ఇందు నీకుఁగావలసినవి కోరుకొనుమని నుడివెను. అందులకు నేను ముదంబంది యమ్మహాత్మునిఁ బ్రార్థించి కొన్నియస్త్రముల గ్రహించితిని.

అర్జు—ఆచార్యా! మీరుగూడ మాపితామహుఁడగు గాంగేయుని వలెనే పరశురామునియొద్దఁ గొంతయస్త్రవిద్యనభ్యసించితిరా?

ద్రోణు—అక్కడనుంచి నేను తొల్లి ద్రుపదుఁడు చెప్పినవాక్యములు జ్ఞప్తికిఁదెచ్చుకొని యతనింజూడనేగితిని.

ధర్మ—ద్రుపదుఁడు మిమ్మతిగౌరవముతోఁ జూచి సత్కరించెననియె తలంచెదను.

ద్రోణు—లేదు. లేదు. దానికి వ్యతిరేకముగా జరిగినది.

అర్జు—ఏమేమి! అతఁడు మిమ్ము సన్మానించలేదా?

ద్రోణు—అతఁడు నన్నుఁజూచి "నీవెక్కఁడ! నేనెక్కఁడ! నేను నృపాలుఁడను; నీవు బీదబాపఁడవు; నీకును నాకును మైత్రియెట్లు; నీవెవ్వఁడవో నేనెఱుంగ; యాచకుల లక్షణం బెఱుఁగఁ జేసితివి. పొమ్ము" అని పలికెను.

ధర్మ—పూజ్యులగు మిమ్మె యట్లగౌరవించెనుగా! ఔరా! రాజ్యమదాంధత్వము! గులకరాళ్ళనుమ్రింగు పారావతమునకు రత్నరాసిలభించినచందమున లోభియగు నాద్రుపదునకుఁ బాంచాలరాజ్యాధిపత్యము ప్రాప్తించినది.

భీము—ధనగర్వము బాల్యమైత్రినిమఱపించినదికదా?

తే. గీ. నిన్ను నారీతిఁజేసిన ♦ నీచమతిని
దగినవిధమున శిక్షించి ♦ తనరకున్న
ధర్మహానివచ్చునుగదా ♦ ధర్మచరిత
యానతీయుఁడు వానిఁ దు ♦ న్మాడివత్తు.

అర్జు—గురువర్యా!

చ. సెలవిడిపంపిరేనిఁగడుఁ ♦ జెచ్చెర భీముఁడు దోడురాగ నే
లలితపరాక్రమక్రమవి ♦ లాసముఁ జూపుచుఁబోయి పార్షదుఁ
గలనజయించి నీదుపద ♦ కంజసమీపమునందునుంతు నా
తులువను దప్పకుండ బుధ ♦ తోషక! నీకు ముదంబుగల్గఁగన్.

ఆద్రుపదునిబట్టితెచ్చి గురుదక్షిణగా సమర్పించుకొందును.

ధర్మ—తమ్ముఁడా! దుర్యోధనాదు లందుకేగదా యిప్పుడరిగినారు. వారాతనినిబంధించి తోడ్కొని రాకయుందురా?

ద్రోణు—నాకునమ్మకములేదు, ద్రుపదుఁడు సామాన్యుఁడుకాడు;

ఉ. అతఁడయోనిసంభవుఁడ ♦ హంకృతిఁబూనినవానిదాఁకి వి
ఖ్యాతిగయుద్ధమందు జయ ♦ మందుట యద్రినశైనఁగష్టమే
నీకెఱిఁగల్గఁగన్గొనియొ ♦ యెంతయుఁ గోరుటఁ జేసి కౌరవ
వ్రాతమునంటితిఁ జయము ♦ వారికిఁ గల్గదు నిశ్చయంబుగన్.

అర్జు-తే. గీ. అతఁడయోనిసంజాతుఁడే ♦ యగుఁనుగాక
నిశితనారాచజాలముల్ ♦ నిగుడఁజేసి
వాని దర్పంబు మాలించి ♦ త్వరితగతిని
నీదుసన్నిధిఁ బెట్టెద ♦ నిర్మలాత్మ.

ధర్మ—(తెరలో కలకలమువిని) ఏదియొధ్వని వినవచ్చుచున్నది.

ద్రోణు—(ఎదుటఁజూచి) నేను చెప్పియుండలేదా! అటుజూడుఁడు
ద్రుపదుని శరాగ్రిమానలజ్వాలల కాగఁజాలక కురుబలములు
వెన్నిచ్చి పరుగిడుచున్నవి.

నకు—గురువర్యా! ఇంకనాలస్యమెందులకు? మాకనుజ్ఞనీయుఁడు.

ద్రోణు—అర్జునా! నీవాతనినిఁ బ్రాణములతోఁ దెచ్చి నాముందుఁ బె
ట్టవలయును. ఏమాత్రము ప్రాణహాని సలుపవలదు. భీమ
నకుల సహదేవులుగూడ నీవెంట రాఁగలరు. పోయిరమ్ము.

(అర్జునుఁడు భీమ నకుల సహదేవులతో నిష్క్రమించును)

ధర్మ—ఆచార్యా! బాల్యహితుఁడగు మిమ్మారీతిని బరాభవించిన దు
ష్చరిత్రునిఁ జంపి రమ్మనక ప్రాణములతోఁ బట్టితెమ్మనియాన
తిచ్చిరేమి?

ద్రోణు—పరిభవించి విడిచివేసితిమని యాతఁడుబుద్ధిమరల్చుకొనును.
(ఇంచుకయూరకుండి) మనమాస్థలమునకుఁ జేరి రణచిత్రముఁ
జూచుదము.

(ఇరువురును కొంతదూరమునడచి కూర్చుందురు.)

(తెరలో కలకలము)

ద్రో॥—ధర్మతనయా! అటుచూడుము. ద్రుపదునకును నర్జునునకును గలహమెంత ఘోరముగ జరుగుచున్నదో!

ధర్మ—(పరికించి) ద్రుపదుని పరాక్రమము వర్ణనాతీతమైయున్నది. మీరు చెప్పినట్లితఁడు సామాన్యపరాక్రమవంతుఁడు కాఁడు.

ద్రో॥—

ఉ. అతఁడు సర్వలోకముల ♦ నాజి జయించెడువాఁడయైన నీ
చేతములోనసందియముఁ ♦ జెందఁబనేమి బలారిపుత్రి వి
ఖ్యాతశరాగ్నిలో మిడుత ♦ యై పడుమాటయె సత్య మీవునుం
జూతువుగాక యాకృపత ♦ నూనుఁడు పొందునవస్థధర్మజా!

ధర్మ—(తేటిపాఱఁజూచి) ఆచార్యా! నీవు చెప్పినమాట నిశ్చయమే. అదిగో! ద్రుపదుఁడు విగతరథుఁడైనాఁడు.(మరలఁజూచి) మన యర్జునుఁడు రథమునుండి లంఘించి ద్రుపదునినొడిసిపట్టి యి ట్లు దెచ్చుచున్నాఁడు.

(బంధింపఁబడిన ద్రుపదునితో నర్జునుఁడు ప్రవేశించును)

అర్జు—(ద్రుపదుని గురుని ముందుపెట్టి) ఆచార్యా! ఇదిగో; గురుదక్షిణ సమర్పించుకొనుచున్నాను.

ద్రో॥—(ద్రుపదునిఁజూచి పరిహాసముగా) ఓహో ! వీరెవరు ? రాజ్యైశ్వర్యభోగసంభూతాహంకారముచేత బాల్యమైత్రిని మఱచి నిండుసభయందు నన్ను నిరాదరణ మొనర్చిన ద్రుపద మహారాజులా యేమి?

తే. గీ. బలరాక్రమవిక్రమ ♦ వంతులై; య
శేషసైన్యపరివృతులై ♦ చెలఁగుచుండి

పట్టువడిరె పాంచాల భూ ♦ పాలవరులు
వింతగాఁ దోఁచుచున్నది. ♦ స్వాంతమునకు.

తే. గీ. స్థానబలిమిచేత స్వామహా ♦ స్థానమందు
మమ్ముఁదెగడుటకుఁ గారణం ♦ బైనభూరి
రాజ్యవైభవభోగము ♦ ర్వారగర్వ
మిప్పుడుఁడగియుండెనుగా! మ ♦ హీతలేశ!

ఇప్పుడయినను నీదుద్రుపదమహారాజులు మమ్ము గుర్తించిరా? (ఇంచుక కోపముతో)

శా. ఓరీపార్షత! భూమినాయకులు లే ♦ రో ధాత్రినిత్యంబు న
త్కారుణ్యంబున భూమిదేవతతినిఁ ♦ కాపాడిరక్షింపరో
పారంపర్యపుమైత్రివారలను సం ♦ భావించి పూజింపరో
యేరైనన్ నినుబోలె దుష్టమతులై ♦ యీరీతినిందించిరే?

ధర్మ—(ద్రుపదునిఁజూచి)

తే. గీ. తనకుఁగల్గిన సంపద ♦ తనదుహితులు
బంధుజనులనుభవింప ♦ వలయు నట్లు
గాక యొరులకు నీకుండ ♦ గర్వమూను
వానిభాగ్యంబు కాల్పనా ♦ వసుమతీశ.

ద్రోణు—(ద్రుపదునిఁజూచి) ఓరీ! ద్రుపదా! మనమిరువురమును మాతండ్రి యాశ్రమమున వృద్ధిపొందలేదా? ఒకతుణమైన నెడబాయకుండ స్నేహముతో మనము మెలఁగలేదా? అగ్నివేశ్యునియొద్ద మనము విద్యలనేర్వలేదా? అట్టి దినములలో "నేను రాజ్యభారమువహించియుండుకాలమున మన్నికటమున కీవు రావలయు" నని నీవు పలికియుండలేదా? (ఇంచుకయూరకుండి) నేను పచించిన వాక్యములలో నేమైన నసత్యమున్నఁ

చెప్పుము. నీయవినయబుద్ధియు, నీగర్వమును విదితమయ్యెనే
గాని నీవు నన్ను బరాభవించినందువలన నాకుఁ గొఱంతయేమి
కలిగినది. దుష్టచిత్తుఁడవగునీవు విశ్వానుమనోమాన్యుఁడైన యా
పృషతరాజేంద్రుగర్భమున గరళము క్షీరజలరాశిని బుట్టిన
చందంబునఁ బుట్టితివి. నీవుమాకొనర్చిన పరాభవమునకిప్పుడు
నీవు మాచేతఁ జిక్కినందుకు నిన్నేమిచేసినను చేయఁగలము.
మమ్మడ్డువారెవ్వరు? కాని నీతండ్రి నాతండ్రికిఁ బరమహితుం
డగుటంజేసి క్షమించి విడుచుచున్నాను. (అర్జునుని జూచి) అర్జునా!
ఈతనిని బంధవిముక్తునిఁ జేయుము?

అర్జు—(అట్లు జేయును)

ద్రోణు—ద్రుపదా! ఇఁకఁ బురంబునకరిగి బుద్ధిగలిగి వర్తింపుము.

ద్రుప—(తనలో) ఈభూసురుండు నన్నింతగాఁ బరాభవించినాఁడు.
సురాసురుల కజేయుఁడవగు నన్ను విజయుఁ డవలీల గెల్చినాఁడు.
కానిమ్ము; ఇప్పుడు నేను చింతించినందువలనఁ బ్రయోజనము లే
దు. తపంబొనర్చి ద్రోణునివధింపఁజాలిన పుత్రుని, అర్జునునకు
భార్యగాఁ దగినపుత్రికను గాంచెదఁగాక (నిష్క్రమించును)

ద్రోణు—(అర్జునునిఁజూచి)

ఉ. ఛాత్రుఁడవన్న నీవె కడు ♦ సాహసవృత్తిని బూని ధీజన
స్తోత్రుఁడు వాయునందనుఁడు ♦ సొంపుగఁ దోడగుచేరనాజిలో
ధాత్రివిభుండు పార్షతుని ♦ దాకి జయంబువహించి దేవతల్
స్తోత్రము సేయఁ బెట్టితివి ♦ శూరుని వానిని నాదుసన్నిధిన్.

నీవలన నాపరాభవము పోయినది. (ధర్మరాజాదులనుజూచి) ఇంక మన
ము పురముఁజేరుదము రండు.

(అందఱును నిష్క్రమింతురు)

రంగము:—[హిడింబాసురునివసనము—భీమరక్షితులై ధర్మార్జున నకులసహదేవులు-కుంతియు నిద్రించుచుందురు.]

భీము—(తనలో విదురునినుద్దేశించి) అహా! విదురా! నీవెంతటివరమ ధార్మికుఁడవు! నీవు కౌరవులయొద్దనున్నను నిరంతరముమాశ్రే యమునే కోరుచుందువుకదా!

తే. గీ. నీదుసత్కృప చేతను ♦ గాదె లక్క-
యింట నగ్నిలోఁ బడకుండ ♦ నిట్లు చేరఁ
గల్గినార మీవనభూమిఁ ♦ గాక యున్నఁ
బ్రదికియుందుమె మేము ధ ♦ రాతలమున.

నిన్నుఁ బ్రాణదాతవని పలుకవచ్చును. ఖనకునిచేత వార్త బంపకపోయినను, నాతఁడు బిలము త్రవ్వకపోయినను, మేము బ్రదికియుందుమా! (దుర్యోధను నుద్దేశించి) ఓరీ! కులపాంసనా! దుర్యోధనా! ఇట్టి ద్రోహబుద్ధి నీకేలజనించినది! మమ్ము జంపఁదలఁచియేకదా, నీతండ్రితో మంతనములాడి, వారణాసికిఁబంపి, లాక్షాగృహమునిర్మించి దానికగ్నిఁబెట్టించితివి! ధర్మవర్తనులను నిరంతరము భగవంతుఁడు రక్షింపకయుండునా? (నిద్రించుచున్న ధర్మజాదులనుజూచి) అహా! వీరందరును నొడలుదెలియక నిద్రించుచున్నారు.

మ. చతురంభోధిపరీతమైన ధరణీ ♦ చక్రింబునంగల్గు భూ
పతులెల్లన్ నిరతంబుగొల్వఁగను సా ♦ మ్రాజ్యంబునంబొల్చు నీ
క్షితిపాలోత్తముఁడైన ధర్మజుఁడు వా ♦ సింబాసి ఘోరాటవిన్
క్షితిపైఁబండెను దీనికేమనుచు నేఁ ♦ జింతింతుఁజిత్తంబునన్.

(అర్జునునిఁజూచి)

చ. సమరమునందు శత్రువుల ♦ శౌర్యమడంచెడి యస్త్రవేత్తయున్
సమహితసద్గుణుండు; మధు ♦ సూదను బావమఱంది, యిట్లు సా

పాన్పులనువీడి నేలపయి ♦ నక్కుటు మేనురుకేర్పు; భారతీ
రమణుని వ్రాతదాటఁగఁద ♦ రంబగునే యలనెట్టివారికిన్.

ఎండకన్నను-వానకన్నను నెఱుంగని సుకుమారశరీరులగు మాద్రీతనయులెట్లు నిద్రించుచుండిరో!

తే. గీ. కుంతిభోజునిగారాము ♦ కూతురీమె
వాసుదేవుని మేనత్త ♦ పాండుపత్ని
సౌధములయందుదీపించు ♦ చాన, యకట
కటికినేలను నిద్రించెఁ ♦ గాలగతిని.

మేమిట్టికష్టములకుఁ బాల్పడుదుమని యెన్నఁడును నెఱుంగమైతిమికదా! (కృష్ణునుద్దేశించి) కృష్ణా! నీమేనత్తకుమారు లీరీతినుండఁగా నీవూరకొనుట ధర్మమా! (ఇంచుకయూరకుండి) ఆహా! వీరందఱును సంపూర్ణనిద్రావస్థనున్నారు. నాకు మిక్కిలి దాహమగుచున్నది. నిద్రలేచిన పిదప వీరికిఁగూడ దాహముగావలసివచ్చును. ఈసమీపమున సరోవరమున్నదేమో చూచి దాహముఁదీర్చుకొని వీరికిఁగూడదెచ్చి యుంచెదఁగాక—(నిష్క్రమించును)

(తెరలో)

సోదరీ! హిడింబీ! నేఁడు మనవనమున కెవ్వరో నరులు వచ్చినారు, వారిం జంపి తెచ్చి నాకాహారముగ వండిపెట్టుము?

భీమ—(ప్రవేశించి) ఇప్పుడేవియో భయంకరారార్భాటములు వినవచ్చినవి. ఇయ్యది రాక్షససంచారమగువనము కాఁబోలు! (ప్రవేశించి) వీరింకను నిద్రించుచునేయున్నారు.

హిడిం—(ప్రవేశించి) ఓరీ! దుష్టమానవులారా! నేఁడు మిమ్ముఁజూచుట నాకుఁ గనులపండువుగనున్నది. (నిద్రించుచున్న వారిమీఁదకుఁ బోఁబోయి భీమునిఁజూచి యాగును.)

భీము—(తనలో) ఇదియొకరాక్షసి. దీనివికృతాకార మెట్టివారికైనను భయముపుట్టించును.(ప్రకాశముగా) దుష్టనక్తంచరీ! నీరూప మునకును, భయంకరారావములకును నిక్కడ భీతిల్లువా రెవ్వరును లేరు. నీకుఁ బ్రాణములపై నాశకలదేని యావలకుఁ బొమ్ము.

హిడిం—(భీమునిఁజూచి-తనలో) భళిరా! ఈతనిదివ్యమంగళరూపము! మానవులలో నిట్టిసుందరదేహులుందురా! మాయన్న పంపున వీరినిఁ జంపుటకు వచ్చితినిగాని యిప్పుడిందులకుఁ జిత్తము స మ్మతింపక యున్నది. నాచిత్త మీ మహాపురుషునియందుఁ జి క్కినది. ఇఁక నేను నావికృతరూపమును విడిచి దివ్యసుందరినై యరుదెంచి యీపురుషాగ్రగణ్యునితో నాయభీష్టముఁ దెలిపి కృతార్థనయ్యెదనుగాక! (నిష్క్రమించును.)

భీము—(తనలో) ఈదైత్యాంగన నావాక్యములకు భయపడినది యరి గెను కాఁబోలు. ఏమైనను నేను జాగరూకుఁడనై యుండవ లయును.

హిడిం—(సుందరియై ప్రవేశించును.)

భీము—(చూచి-తనలో) ఈయర్ధనిశియం దిట్లు వచ్చిన యీకాంత యెవ్వరోకదా! ఈమెశరీరకాంతులు వనమంతయుఁ బ్రకాశింపఁ జేయుచున్నవి. ఇదియొక దైత్యమాయగా నుండనోపు.

హిడిం—(భీమునిఁజూచి) మహాపురుషా! నమస్కారములు. నీవెవ్వరవో నేనెఱుంగను, ఆర్తనై నీసన్నిధి కరుదెంచితిని. కరుణించి నా యభీష్టముఁ దీర్పుము,

భీము—(తనలో) ఈమె యభీష్ట మేమైయుండును. (ప్రకాశముగా)

తే. గీ. ఎవ్వతెవునీవు నొంటిరా ♦ నేల? నర్ధ
రాత్రిసమయంబునందు న ♦ రణ్యమునకు

నన్నుఁ బ్రార్థింపఁగానేల నాతి! నీయ
భీష్టమెట్టిది తెలుపుమా వినెదువాఁడ.

నీకెవ్వరివలననైనను హానిసంభవింపలేదుకదా? అట్లయినచో శరణాగతత్రాణ బిరుదాంకితుఁడగు భీముఁడు సైపఁడు.

హిడిం—(తనలో) ఈతనివాక్యములవలన నితనిపేరు భీముఁడని తెలియుచున్నది. ఓహో! వీరుపాండవులు కాఁబోలు! (ప్రకాశముగా) నాయభీష్టముఁ దెలుపుమనినందులకు మహానందితనైతిని. సుందరాకారా! ముందుగ మీరెవ్వరో యెఱుంగవచ్చునా?

భీము—మేము పాండురాజనందనులము. (ధర్మరాజాదులఁజూపుచు) అతఁడు నాకగ్రజుఁడగుధర్మరాజు —అతఁడు నాతమ్ముఁడర్జునుఁడు. వారిరువురును నకులసహదేవులు, ఆయమ మాతల్లియగు కుంతి.

హిడిం—మహాపురుషా! ఇయ్యది హిడింబాసురునివనము. నేనాతని చెల్లెలను. నన్ను హిడింబియందురు. మీరందఱును నివ్వనమునఁ బ్రవేశించిన జాడఁ గనిపెట్టి మాయన్న మిమ్ము వధించిరమ్మని పంపఁగావచ్చితిని. కాని, నీసుందరరూపముఁ జూచినంతనే చిత్తము మాఱిపోయినది, ఇఁక నన్నుఁ జేపట్టి రక్షింపుము?

భీము—(తనలో) ఇట్టిభువనమోహిని రాక్షసులయందుండునా?

హిడిం—వీరాగ్రేసరా! ఆలోచించుచుంటివేమి? ఆలస్యమునకు సైపఁజాల. నాయభీష్టము దీర్చితివేని, నావలన మీరనేకసహాయములనందఁగలరు.

భీము—మాంసాశనివగు నీవలన మాకేమి సాయమొందును?

హిడిం—మాయన్నకుఁ జిక్కకుండ మిమ్ము రక్షించెద. అతఁడు వచ్చునేని మిమ్ములఁ జంపును.

భీము.—మీయన్న సంగతి జెప్పి నన్ను భయపెట్టఁ జూచుచుంటివా?

తే. గీ. అష్టదిక్పతులంగూడి ♦ యమరవిభుఁడు
వచ్చుగాకనునాతోడ ♦ భండనంబు
సలుప; నినుమింతభయమంద ♦ చాన! వినుము
దైత్యనాథుని బలమున్న ♦ దలఁప నేల.

ఇదియేకదా నీవు చేయనెంచిన సహాయము! నేను నీయన్నకు భీతిఁజెందువాఁడనుగానని తెలియుంగుము.

హిడిం.—వీరపురుషా! అవివేకమున బలికితిని. ఆగ్రహింపవలదు. క్షమించి నాయభీష్టముఁదీర్పుము—

భీము.—నీవు దైత్యాంగనవు. నేనుమానవుఁడను. నీకును, నాకును సంబంధ మెట్లుకుదురును. ఇంక నీవనికిమాలిన ప్రశంస విడిచి సత్వరముగఁబోయి నీయన్నను బంపుము. వానిం దునుమాడి యరణ్యమున రాక్షసభయము లేకుండఁ జేయుదును.

హిడిం.—నీవు నాయగ్రజుని వధించినను సమ్మతింతును. నేను దైత్యాంగనని నీవు సంశయింపఁబనిలేదు. నేను కామరూపిణిని. ఖేచరీవిద్యాప్రభావమున నెట్టిరూపము గావలసిన నట్టిదానింబొందెదను.

భీము.—(తనలో) ఈకాంత తనకు నాపైనున్న వలపుచే నగ్రజుని వధకుఁగూడ సమ్మతించుచున్నది.

హిడిం.—వాయునందనా! అన్నము పెట్టవచ్చినవా డెవ్వరైన నిరాకరింతురా? మార్గమధ్యమున ధనముదొరికిన నెవ్వరైనఁ గాలఁదన్నుదురా? నిన్ను గామించివచ్చిన నన్ను రక్షింపకుండుట ధర్మమా! రక్షింపుము—

(పాదములపైఁ బడును)

(తెరలో)

ఏమే హిడింబీ! ఆ మానవాధముల వధించి తీసికొనిరమ్మని నీకు
వచింపఁగా, నేఁ జెప్పినమాటలు మఱచి, యాపురుషునితో నేమో
సరసములాడుచున్నావా ? కానిమ్ము; ఇదిగో వచ్చుచున్నాను.

హిడిం—భయము నటించుచు) వీరాగ్రేసరా ! కోపమూర్తి నాయన్న
యిట్లు వచ్చుచున్నాఁడు—రక్షింపుము.

భీము—అబలా ! భయమందవలదు. నీయన్నను నిమేషములోఁ జంపి
వచ్చెదను. అతఁ డిక్కడకు వచ్చెనేని మావారికి నిద్రాభంగ
మగును. కావున నీవు వీరిని జాగ్రత్తగాఁ గాపాడుచుండుము.
నీయన్నను మర్యాదఁ జేసివచ్చెదను.

(నిష్క్రమించును.)

ధర్మ—(అదరిపడి లేచి) ఇప్పుడేదియో భయంకరధ్వని వినవచ్చినదే.
(ప్రక్కం జూచి) నాతల్లియు సోదరులును నిద్రించుచునేయు
న్నవారు. అక్కటా! నాతమ్ము లీ నేలపై నెట్లు శయనించిరో-
పరులకెన్నఁడును నపకార మొనర్చి యెఱుంగనివీరు ; పరాంగన
ల నాశించి యెఱుంగని వీరు ; కలనైన నసత్యమాడి యెఱుంగని
వీరు; విధికృతమున నిట్టి స్థితి నుండిరికదా! (తల్లిం జూచి) అమ్మా!
నీవు మాతండ్రి యున్నప్పు డెట్టిసౌఖ్యముల నందియుంటివో కా
ని, మామూలమున నెప్పుడును కష్టములనే యనుభవించుచుం
టివి. తల్లీ ! నీకడుపుచలవచేత మేమందఱమును దుర్యోధన
నిర్మితలాక్షాగృహాగ్ని జ్వాలలఁబడి దగ్ధులముగాకుండ బ్రదికితిమి,
(ప్రక్కం జూచి) తమ్ముఁడా! ! భీమన్నా ! ఏమి పలుకవు? (ఇటు
నటు జూచి) తమ్ముఁడా ! నీ వెచ్చట కరిగితివి ? మాతోఁ గష్టము
లందలేక నీదారి నీవు చూచుకొంటివా ?

హిడిం—దేవా ! మీసోదరుఁడీప్రాంతమునయున్న హిడింబాసురునిఁ జంపనరిగినాఁడు. ఇప్పుడే రాఁగలఁడు. అతఁడరుదెంచువఱకును మిమ్మురక్షించు భారము నాపైఁ బెట్టినాఁడు.

ధర్మ—తమ్ముఁడా ! నీకిదేమిసాహసము! హా! నన్నెవ్వరినైన సహాయముఁగొనకుండ నొంటిగ నేగితివేల ?

(కుంతియు, నర్జునాదులును మేల్కాంతురు.)

కుంతి—(ధర్మరాజునుఁజూచి) కుమారా ! ఇదియంతయు రాక్షసులు సంచరించు మహారణ్యము కాఁబోలు ! మనభీముఁడేడి ?

ధర్మ—హిడింబనామకదనుజునివధింపఁ బోయినాఁడఁట.

కుంతి—అక్కటా ! ఇదియేమి సాహసము. కుమారులారా ! నాచిత్తమున భయముకలుగుచున్నది.

ధర్మ—అమ్మా! నీవు భీమునిఁగూర్చి భయమందవలదు. (అర్జునునిఁజూచి) అర్జునా ! నీవు బాణపాణివై భీముఁడరిగిన ప్రదేశమొంటేఁగి యతనికిసహాయమొనర్పుము?

అర్జు—ఇదే పోవుచున్నాను—(నిష్క్రమించును.)

కుంతి—(హిడింబినిఁజూచి) ఇంతీ ! నీవెవ్వరవు ? ఇయ్యరణ్యమున కేల వచ్చితివి ? మమ్ముఁజంపుటకువచ్చిన దైత్యకామినివి కావుకదా ?

హిడిం—తల్లీ ! నీవుతలంచినట్లు నేను దైత్యవనితనే ఇప్పుడు నీనందనుఁడు నాయగ్రజునే చంపుటకరిగినాఁడు. తొలుత మాయగ్రజునిపంపున మిమ్ముఁజంపుటకే వచ్చితినిగాని, మీభీమసేనునిఁ జూచి చంచలితస్వాంతనైతిని. అతఁడే నాకిఁక నాథుఁడును, దైవమునైయున్నాఁడు.

(తెరలో)

అన్నయ్యా ! భీమసేనా ! తెల్లవారవచ్చుచున్నది. ఇఁక వానిం దెగటార్పుము.

ధర్మ—మనయర్జునుఁడు భీమునిఁ గలిసికొనినాఁడు. తమ్ముఁడు సుఖము
గా వచ్చుఁగాక?

కుంతి—(హిడింబినిఁజూచి) దైత్యాంగనా! మేము నరులము. నీవు నర
హంత్రివి. అట్టిచో నిన్నుఁగైకొనుటకు నాతనూజునిచిత్తమెట్లు
సమ్మతించును. నీవీయాసవదలుము. ఇంతవఱకును మమ్ము
రక్షించినందులకు నీయెడల మేము సర్వదా కృతజ్ఞులమై
యుందుము.

హిడిం—(రహస్యముగా) కుంతీమహాదేవీ! నీకుఁదెలియని ధర్మమేము
న్నది. సుందరులగు పురుషులనుఁజూచినస్త్రీలు మోహమందు
ట సామాన్యమైనసంగతియే. భీముఁడే నాకుఁబ్రాణేశ్వరుఁడని
తలఁచి నాయగ్రజునిఁగూడ విడిచివచ్చితిని. నీతనయుఁడు
నన్ను గ్రహింపఁడేని, యాతనిచరణసన్నిధిని ప్రాణములు వా
యుదును ; ఇదియే నానిశ్చయము.

ధర్మ—(ఎదుటఁజూచి) అదుగో భీముఁడు విజయలక్ష్మీలాలితుఁడై
యర్జునునితో వచ్చుచున్నాఁడు?

(భీమార్జునులు-ప్రవేశింతురు.)

ధర్మ—తమ్ముఁడా! వచ్చితివా?

కుంతి—కుమారా! ఇంతసాహసము తగునా?

నకు—అన్నయ్యా! మమ్ముఁ బిలువకుండ నొంటరిగ నేగితివేల?

భీము—మీకు నిద్రాభంగ మేల కలుగఁ జేయవలయును? ఇదియుం
గాక యారక్కసునివధించుట కింతమంది కావలయునా?
(హిడింబినిఁజూచి) ఈమె యాదైత్యుని సోదరియే. దీనింగూడ
వధించెదఁగాక! (మీఁదకుపోఁబోవును.)

ధర్మ—(వారించి) తమ్ముఁడా! స్త్రీలమీఁదనా నీవు బలము జూపించెదవు?

తే. గీ. చంపఁదగినట్టి దైత్యునిఁ ♦ జంపినావు
తరుణిపై శౌర్యమును జూపఁ ♦ దలఁతువేల
యీమె మనసార నిన్నుఁగోరి ♦ యిట్లువచ్చెఁ
గరుణఁజూచుచు గ్రహియించి ♦ కావుమనుజ!

ఈమె దైత్యకాంతయేయగును గాక! మహాజ్ఞానసంపన్నురాలువలె నున్నది. తనచిత్తము నీయధీనముఁ జేసి వచ్చిన కాంతను విడనాడుట ధర్మము కాదు.

హిడిం—(కుంతినిఁ జూచి రహస్యముగా) సమస్తస్త్రీరహస్యముల నెఱిఁగిన నీవైనను నీసుతునకు దెలిపి నన్ను గ్రహించినట్లు జేయుము. లేదేని నాప్రాణము లిచ్చటనే విడిచి ముందుజన్మముననైన నీతనినిఁ బ్రాణేశ్వరునిగాఁ బడసెదను (అందఱువినునట్లు) నన్ను సామాన్యదానవకామినిగా భావింపవలదు. నావలన మీకెట్టి దుర్ఘటకార్యమైనను నెఱవేఱును. మీకు ముందు వచ్చుసంగతులన్నియుఁ దెలుపుచుందును. మీరిక్కడనుండి తిన్నగాఁ బోయితిరేని, శాలిహోత్రుఁడను మునీంద్రునియాశ్రమమును జూడఁగలరు. అందొకకాసారము, వనస్పతియు నుండును. ఆసరోవరజలములు ద్రావిన నాకలిదప్పులుండవు. మీరక్కడనుంటిరేని వ్యాసుఁడరుదెంచును.

కుంతి—(తనలో) ఈమె మహామహిమగల దివ్యవనితవలె నున్నది. (భీము నిఁజూచి) వత్సా! భీమా! నీవీమెను గ్రహింపుము. (హిడింబినిఁ

గాంచి) నీవుత్తమస్త్రీగుణములు కలిగి భీమునకుఁ బ్రియము సేయుచుండుము.

భీమ—అమ్మా! నీయానతి కన్యథా వర్తింపఁజాలను. ఇక్కాంతతో నందనోదయమగువఱకును నుండెద.

ధర్మ—అల్లియుగుఁగారా! ఈహిడింబి చెప్పినట్లు మనము శాలిహోత్రుని యాశ్రమమునకుఁ బోవుదము. రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.





# పాండవాజ్ఞాతవాసము.



## ద్వితీయాంకము.



రంగము:—ఏకచక్రపురము:—బ్రాహ్మణగృహము.

(ప్రవేశము:-భర్త భార్య పుత్రుఁడు పుత్రిక.)

భర్త—హా దైవమా! నీవు మాయంతము జూడఁదలఁచితివి కాఁబోలు! ఆదుష్టరక్కసున కాహారంబుగాఁ బోవుటకు నేఁడు మావంతు వచ్చినది. ఆనక్తంచరున కెవ్వరిని నాహారముగా బంపుదును? విధ్యుక్తప్రకారమున మత్పరిణీతయై, ధర్మచారిణియు, వినయవతియు ననువ్రతయు నగు నిక్కుటుంబిని నెక్కరణిఁ గ్రక్కున రక్కసున కాహారంబగుమనియనుపుదు! అధికధర్మప్రవృద్ధిగాఁదగినవరున కర్పింప విధాత్రునివలనఁ బడసిన యిక్కుమారి, నతిబాల, దీనియందుద్భవిల్లు దౌహిత్రలాభంబు దొలంగ నత్తెఱంగున నారాక్షసున కశనంబగుమని విసర్జింతు! అస్మదీయపిండోదకప్రదాననిదానుండును, వంశవర్ధనుండును, పిత్రృణమోక్షణుండును నగు నిక్కుమారు నెఱచెలువానిం జూచిచూచి యెప్పగిది నప్పిశితాశి వాతం ద్రోతు! నజీవుఁడ

నై యిట్టికఠినకర్మ కొడంబడఁజాల. అద్దానవుడ కేన భత్యం బత్మెద.

భార్య—ప్రాణేశ్వరా! ఏలమీరీరీతిఁ జింతించెదరు ?

తే. గీ. ఘోరవిపదంబురాసిలోఁ ♦ గూలినాము
దానిఁ దరియించ మనకును ♦ దరముకాదు
చింతఁబొందఁగనేటికిఁ ♦ జిత్తమందు
నసురకాహారముగ నేన ♦ యరుగుదాన.

మీరు ధైర్యమున నుండుఁడు. వంశవిస్తారకుఁడగు తనయుఁ డున్నాఁడు. అదిగో పుత్రిక! ఇఁక నేమి కావలయును?

తే. గీ. భవ్యగుణమూర్తి యైనట్టి ♦ వరునిఁదెచ్చి
కన్నకు వివాహమొనరించి ♦ వన్నెమీఱ
నీసుతునిఁజూచుచు ♦ నెట్టులెటులో
కాలమును వెళ్ళఁదీయుఁడు ♦ కలుషరహిత.

భర్త—ఎంతకష్టమెంతకష్టము! ఎన్నఁడును నిన్ను విడిచి యుండనని యనలుని సముఖమున బాసచేసి నిన్నుఁగైకొని యిప్పుడసురవాతం దోఁయుదునా? పుత్రి పుత్రరత్నంబులఁ జూచుకొనుచు నీ వుండుము. నేనరిగెద.

భార్య—నాథా! మీరేగవలదు. ప్రాణములు విడిచియైన భార్య భర్తకు హితము సేయవలయును. ఇదియుంగాక;

తే. గీ. భర్తకంటెనుముందు స్వ ♦ ర్గంబు జేరు
సతి జగంబులయందు య ♦ శంబుఁగాంచు
భర్తృహీనయౌ సత్కాంత ♦ బ్రతుకుజనుల
చేఁ గడు నసహ్యముగను వీ ♦ క్షింపఁబడును.

మఱియు భార్య మరణించెనేని భర్తకుఁ బునర్దారాసంగ్రహమునకధికారముకలదు.

పుత్రి—జననీజనకులారా! ఏలమీరీరీతిని విచారింతురు? మీరునన్నింతకాలము పెంచినను నేను మీదాననుగాను. నన్నొరులకిచ్చుటకన్న మీప్రాణసంరక్షణార్థమై యసురునివాతం బడవేయుట మిగుల పుణ్యము. ఇఁక నన్ను బంపుఁడు.

బ్రాహ్మ—పుత్రీ! నీవేగవలదు.

పుత్రి—తల్లిదండ్రులారా! మీరెవ్వరును బోవలదు; నన్నుఁబంపుఁడు.

బ్రాహ్మ—కన్నకొడుకును నిన్నట్లు పంపుదును, (భార్యనుగాంచి) రమణీ! నేనరిగెదను, బిడ్డలఁ జూచుకొనుచుండుము.

(అంత కుంతి-ప్రవేశించును)

కుంతి—(తనలో) పాప మీయింటిలోని వారందఱును నెందులకో నేఁడు మిగుల దుఃఖించుచున్నారు. (సమీపించి) బ్రాహ్మణోత్తమా! మీరీరీతిని శోకించుచుండుటకుఁ గారణమేమి?

బ్రాహ్మ—అమ్మా! ఏమిచెప్పుదును? ఈపురమున కనతిదూరమున నున్న యరణ్యమున బకాసురుఁడను నొకదానవుఁడున్నాఁడు. ఆదుర్మార్గుఁడు పురమునఁ బ్రవేశించి యిచ్చవచ్చిన లీల మానవులను జంపుచుండఁ బురజనులందఱును భయమంది, వానితో బ్రతిదినమును బురిలోనికివచ్చి ప్రజలను హింసింపవలదనియు, నింతటినుండి యనుదినము నిలువరుస నొక్కమానిసిని, రెండెనుబోతులఁ బూన్చిన శకటంబుపై వివిధభక్ష్య భోజ్యములతో భోజనమును బంపుచుందుమనియు, నొడంబడికఁ జేసికొనిరి. ప్రతిదినమునట్లు జరుగుచున్నది. నేఁడు మాయింటివంతు వచ్చినది. అందుచే దుఃఖించుచుంటిమి.

కుంతి—బ్రాహ్మణదంపతులారా! ఇంక మీరీవిషయమును గూర్చి విచారింపవలదు. నాకేవురు తనయులున్నారు. అందొక్కని దైత్యున కాహారముగఁ బంపెదను.

బ్రాహ్మ—అమ్మా! ఎంతమాటఁబలికితివి! ఇట్టిమహాపాతకమునకు నేనుపాల్పడుదునా? అతిథిని, నభ్యాగతుని, శరణాగతుని జంపనెంచువాఁడు ఘోరనరకమునఁ బడఁగలఁడు,

కుంతి.—ఓయీ! నేనుమాత్రము కుమారుని గోలుపోవుదునని తలంచితివా?

తే. గీ. దైత్యవంశాధమునిఁ గూల్పఁ ♦ దగుబలాన్వి
తునిఁగ నెఱిఁగి మదాత్మజుఁ ♦ బనుతుఁగాక
నూర్వురు తనూజులున్న ధ ♦ న్యాలకున్నఁ
దమకునిష్టుఁడుగాని పు ♦ త్రకుఁడు కలఁడె.

నాయాత్మజునిశక్తి మీరెఱుంగరు. వానిచే నక్తంచరుఁడీల్గును. (ఎదుటఁజూచి) నాయనా! భీమా!

(భీముఁడు-ప్రవేశించును)

భీము—అమ్మా! ఏమిసెలవు?

కుంతి—కుమారా! ఇచట కనతిదూరమునన్నున్న యరణ్యమున బకాసురునకు నిలువరుసననుసరించి నేఁడీ బ్రాహ్మణుని గృహమున నెవ్వరైన నాహారముగఁ బోవలయునఁట. అందులకై వీరు శోకించుచున్నారు. కావున నీవు రెండెనుబోతులు పూన్చిన శకటముపై నాహారముఁ బెట్టుకొని, యాదనుజునికడకరిగి వానిం జంపి వీరినిఁ గాపాడవలయును.

భీము—అమ్మా! ఇంతకన్న సుకృతమేమియున్నది?

శా. ఉల్లాసంబున వీరిమెచ్చఁగను న ♦ య్యుగ్రాహవక్త్రుఁడగా
ముల్లోకంబుల నేచుపాతకుని నేఁ ♦ బోకార్చియేతెంచెదన్
దల్లీ! యన్నము దిండివంటకము మా ♦ దంబారఁ బెట్టింపుమీ
యుల్లంబిమ్మెయి నాబకాసురవధో ♦ ద్యోగంబునన్ మించెడున్.

బ్రాహ్మ—బాహుశాలీ! ఇంతమాత్రమునకై నీవు తల్లి నడుగవలెనా? ప్రాణదాతవగు నీకుఁ గడుపునిండ నన్నమే పెట్టలేమా? రమ్ము (చేయిఁబట్టుకొని తీసికొనిపోవును)

కుంతి—(తనలో) భీమునివలన నాదుష్టబకాసురుఁడు తప్పక కూలును. (ఇంచుక యూరకుండి) ఆహా! దుష్టులగు కౌరవుల మూలమున నఁగదా నాకుమారులిట్లు ప్రచ్ఛన్నవేషములనుండి మధుకర వృత్తిని కాలముగడుపుచుండిరి. మీకు శుభదినములు త్వర లోనె ప్రాప్తించునని హిడింబి చెప్పి భీమునియందు గన్నకుమా రుఁడగు ఘటోత్కచునిం దీసికొని తననెలవునకరిగినది. (ఎదు టఁజూచి) అయ్యో! ధర్మనందనాదులు మధుకరాన్నముఁ దె చ్చుచున్నారు. (నిష్క్రమించును)

రంగము:—(బకాసురుని నివాసస్థానము. బకాసురుఁడు ప్రవేశము.)

బకా—(తనలో) ఈయేకచక్రపురవాసుల యవిధేయత కేమందును. అనుదినంబును బ్రజలను హింసించక, వారు చెప్పిన చొప్పున నూరకుండుటచే నాయందింత యశ్రద్ధవహించినారు. నేఁడేమి కారణమో, నాహారమింతవఱకును రాలేదు. ఓయేకచక్రపు రవాసులారా! మీరు నన్ను మఱచిపోయినారు కాఁబోలు! కా నిండు. మీపురమెల్ల నిమిషములో భస్మముగావించెద.

(భీముఁడు శకటముతోఁ బ్రవేశించును)

భీము—(తనలో) ఆహారమువచ్చుట యాలస్యమైనదని కాఁబోలు దానవుఁడు భయంకరస్వరూపము దాల్చినాఁడు; కానిమ్ము; వీనికిఁ గాలము సమీపించినది. శల్యమాంసశోణిత దుర్గంధ కలిత మైన వీనినివాసముఁ జేరఁజాల. కావున నిక్కడనే నిలిచియుండె ద. వాఁడే నాకడకు రాఁగలఁడు.

ఉ. అనుమానంబినుమంతలేనక సము ♦ ద్యద్భూరిధైర్యంబుతో
డను నీదానవు దాకి దేవతలు వే ♦ డ్కన్ మెచ్చఁబోరాడి యా
జనహింసాపరుఁ గూల్చివైచెద వెసన్ ♦ సంగ్రామరంగంబులో
ననువీక్షించుచు నేకచక్రపుర మా ♦ నందాబ్ధినోలాడఁగన్.

బకా—(దూరముననున్న భీముని జూచి తనలో) అదిగో! ఎవ్వఁడో యొకమానవుఁ డాహారసమేతముగా శకటమును దెచ్చి యచ్చట నిలబెట్టినాఁడు. వీఁడు నన్ను సమీపింపఁడేమి? (ప్రకాశముగా భీముని జూచుచు) ఓరీ! మర్త్యాధమా! నేఁడింత జాగయ్యె నేమి? ఇట్టియాలస్య మింకొకసారియయ్యె నేని మిమ్ములనందఱ నొక్క దినముననే కాలునిప్రోలి కంపుదును. అయినను నాకాహారముగానున్న నీపై నాగ్రహించినందువలనఁ బ్రయోజన మేమి యున్నది? రమ్ము నాకాఁకలియగుచున్నది.

భీము—(తనలో) వీనివాక్యములు విననట్లునటించుచు, వాఁడిక్కడకు వచ్చులోపుగ నీయాహారమును నేను భుజించుచుండెద. (శకటముపైనున్న యాహారమును భుజించుచుండును)

బకా—(కోపముతో) అరే మూర్ఖా! సత్వరముగ రమ్మని పిలుచుచుండ నావాక్యములు వినిపించుకొనకుండుటయేగాక, నాకై దెచ్చిన యాహారమును నీవు భుజించుచుంటివా? అవురా! నీధైర్యము! ఇదిగో వచ్చుచున్నాను.

భీము—రమ్ము. రమ్ము, నిన్ను నాభుజములసందున నిఱికించెద.

బకా—(సమీపించి తనలో) మిగులనాశ్చర్యముగ నున్నది. త్రిలోకభయంకరుఁడనగు నన్నుఁ జూచి వీఁడొక్కింతయైనఁ జలింపక యున్నవాఁడు, కానిమ్ము. వీని మదమడంచెదగాక! (ప్రకాశముగా) ఓరీ! మనుష్యకీటకమా! నాయాహారమును నీవు తినుచుంటివా? (తన్నుచున్నాఁడు)

భీము—(లక్ష్యముసేయక) ఇదిగో తక్కిన యాహారముగూడ భుజించివచ్చుచున్నాను తొందరపడవలదు.

బకా—(తనలో) నావాక్యముల కెవ్వరును నిట్లు ప్రత్యుత్తరమిచ్చినవారు లేరు. వీఁడెవఁడో యించుకచేవ గలిగినమానిసివలె నున్నాఁడు. (ప్రకాశముగా) ఓరీ! నరపశువా! పిలుచుంటివేమి?

భీము—

ఉ. చాలును నీ బలుమాయమిఁకఁ ♦ జక్కని నీదగునోరు నిప్డు వా
చాలత నేల చూపెదవు ♦ బాహుబలంబును జూపనెంచుమీ
కాలుని లీలవచ్చితిని ♦ గ్రన్నన నిన్ను వధింపనెంచి యో
బాలిశ! యేకచక్రపుర ♦ వాసులు సంతతముల్ సుఖింపఁగన్.

బకా—

ఉ. ఎవ్వఁడవోరి నీవిటు ల ♦ హీనపరాక్రమమున్నరీతినిన్
జివ్వకుగాలుద్రివ్వెదవు ♦ ఛీ! యిటునిల్వుము దేవబృందమే
యెవ్విధి నీబకాసురుని ♦ నిబ్బువిలోపల గూల్తుమంచు వా
రవ్విధిభీతచిత్తులయి ♦ యాత్మల భీతిని గాంచరే ఖలా!

భీము—ఓరీ! క్రవ్యాదాధమా!—నీయట్టహాసమున కిచ్చట భయమందువారు లేరు.

తే. గీ. బలముగలదంచు నెంచి గ ♦ ర్వమును బూని
యేకచక్రపురంబున ♦ నెల్లజనుల
హింస జేయుచునుంటివి ♦ హీనచరిత
దానినడగింప వచ్చితిఁ ♦ దథ్యముగను.

ఓరీ! దురాత్మా! రాజాధిరాజు సామంతరాజులయొద్ద గప్పములఁ గైకొను చాడ్పున, నీవు పాపమనితలఁపక, యేకచక్రపురవాసులయొద్దఁ బ్రతిదినము నిలుపరుస నొకమానిసిచొప్పున నాహారము గ్రహించు

చు కండపట్టియుంటివి. నీమద మెల్ల నేఁడు గ్రక్కించెదను.

బకా—ఏమిరా! నీ కండ కావరము.

క. నరుఁడవు నీవు తలంపఁగ
నరభోజనుఁడనగు దేను ♦ నాకును నీకుం
దరియగునె పోరాడఁగ
దురితాత్మా! పొమ్ము పొమ్ము ♦ దూరమ్మునకుం.

భీము—ఓరీ! నీబీరములిఁకఁ జాలింపుము. కాలము సమీపించిన జ్వర పీడితుఁడు సంధిచే నీరీతినే ప్రేలుచుండును.

బకా—పక్షీంద్రునిముందు ఫణము ద్రిప్పు వ్యాళమువలె నీవు నా యెదుటఁ బ్రేలసాగితివి.

భీము—నీవలెనే ప్రేలి యింతకుమున్ను నాచే హిడింబాసురుఁడు యమలోకముఁ జేరినాఁడు.

బకా—(కోపముతో) ఏమేమీ! నీవేనా హిడింబుని గూల్చితివి! రమ్ము నిన్ను వధించి పగదీర్చెద.

భీము—

కవిరాజవిరాజితము.

శరములు హస్తమునందున బూనుచు ♦ శౌర్యము జూపక యీ
కరణిని విక్రమముండెనటంచును ♦ గాఱులు ప్రేలెదవే
సరగున నన్ను నెదుర్చుము భీకర ♦ సాహసమేర్పడఁగా
దురితరతా! కనువాఁడను నీదగు ♦ దోర్బలవిక్రమముం.

బకా—

కవిరాజవిరాజితము.

మదిని సుమంతయు భీతిని బూనక ♦ మస్మ్రదిరించెదవే
త్రిదశులు గూడను నన్నదిరింపఁగ ♦ ధీరత బాయుఁగ, దు

ర్మదకుని నీవిటువచ్చితివా నము ♦ రంబును సేయుటకై
మదమడగించెద వ్రాణము ♦ బాపెద ♦ యూసవ చూడుమిదే.

(ఇరువురును రణమునకు మొనయుచున్నారు.)

బకా—ఈదెబ్బ గాచుకొనుము.

భీము—(దెబ్బతప్పించుకొని) నీదెబ్బ తప్పించుకొంటిని, నాముష్టిఘాత
మును జవిఁజూడుము.

(ఇరువురును గొంతసేపు ముష్టియుద్ధము సేయుదురు.)

భీము—ఓరీ! బకా! ఇఁకనీవెందుఁబోఁగలవు. (పట్టుకొని నేలఁబడవైచి)

ఉ. మించితవరాక్రమించితివి ♦ మేదినియందున భీతిలేక, హిం
సించితనేకభూసురుల ♦ శ్రీయము నెంచక యట్టినిన్నిదే
దంచుచునుంటిఁ జిండిగను ♦ తప్పకయిప్పుడునమ్ముదంబు న
ర్పించెద నేకచక్రపుర ♦ వృద్ధిసురాళికి దుర్మదాధమా.

(చంపుచున్నాఁడు.)

బకా—హా! (ప్రాణములు విడుచును.)

భీము—ఈదైత్యుఁడు మడసినాఁడు—వీని కళేబరమును పురజనులు చూ
చుటకై నగరములోనికీడ్చుకొనిపోయెదఁగాక.

(అట్లు చేయుచున్నాఁడు.)

ఇది ద్వితీయాంకము.



# పాండవాజ్ఞాతవాసము

## తృతీయాంకము.

రంగము:—(హస్తినాపురము—కౌరవ సభామందిరము ముఁగు విదురుఁడు ప్రవేశము)

విదు—(తనలో) ఔరా! సుయోధనా! పాండురాజనందనులన్న నీ కింతయసూయయేమి? చిన్నతనమునుండియు వారికెగ్గులు సలుపుచునేయుంటివి, లాక్షాగృహాగ్నిజ్వాలలఁబడి దగ్ధులుగాకుండ నెట్లో పరమేశ్వరునికృపవలన బ్రదికి, ద్రుపదపుత్రికనువివాహమాడఁగా, నీజనకుండు మామాటలు విని వారిని రావించి యర్ధరాజ్యమొసఁగి యింద్రప్రస్థపురమునకుఁ బంపెను. వారర్ధరాజ్యశ్రీనిఁ బొందినప్పటినుండియు, నెట్లయినవారికి హాని సేయఁదలంచుచునే యుంటివి. నీవిచారము వారికి శుభప్రదమగుచుండెను. తీర్థయాత్రకరిగిన యర్జునుఁడులూచి యను నాగకన్నియను, మణిపురాధీశుని పుత్రికయగు చిత్రాంగదను శ్రీకృష్ణుని చెల్లెలగు సుభద్రను వివాహమాడి వారియందు

నందనుల గాంచుట శుభముగాదా? ధర్మనందనునకు మయుఁ
డొసంగిన సభఁ జూచియు, నాతఁడొనర్చిన రాజసూయమహా
ధ్వర మీక్షించియు, నీవసూయవహించి యేకద వారి నిట్లయి
నఁ బదభ్రష్టులఁ జేయఁదలంచి, యిప్పుడు సుహృద్ద్యూతమను
నెపంబున వారిని నాచేఁ బిలువఁబంచితివి. వృద్ధుఁడును, బంధు
డును నగు నీతండ్రికిఁగూడ, నీవిషయమున బుద్ధిలేకపోయెను.
(ఎదుటఁజూచి) అదిగో! అందఱును ద్యూతరంగమును జేరినా
రు. ధర్మనందనుఁడగు యుధిష్ఠిరుఁడుగూడ శకుని కైతవద్యూత
మున కంగీకరించినట్లే యున్నది. (పరికించి) ద్యూతముగూడ
ప్రారంభమైనట్లే యున్నది. నేనుగూడ నేగి యిందెట్టివిధమున
కలహము సంభవింపకుండునట్లు ప్రయత్నించెదఁగాక!

(నడచుచున్నాఁడు తెర లేచును)

(ధృతరాష్ట్రుఁడు—భీష్మద్రోణులు- దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణ
వికర్ణులు—పాండవులు—ప్రవేశింతురు)

విదు—(ధృతరాష్ట్రుని సమీపించి) కౌరవేశ్వరా! జూదమునకు నీ
వంగీకరించితివి. దీనివలన నేమిప్రమాదము వాటిల్లునో యని సంశ
యమగుచున్నది.

ధృత—భీష్మద్రోణులును నీవును నుండగా నట్టిది యేల సంభవించును?

శకు—(ధర్మరాజుంజూచి) ధర్మనందనా! ఆలోచించుచుంటివేమి?
ఆడుటకుఁ గూర్చుంటివిగదా—మరల చిత్తము వెనుకకులాగుచు
న్నదా యేమి?

ధర్మ—గాంధారరాజా!

ఉ, వచ్చితిమీరువాకటుల ♦ వార్తను రమ్మని పంపినంతనే
వచ్చి దురోదరంబునకు ♦ భావములోపల సంశయింతునే
నచ్చనిమాటలేల నర ♦ నాథులలో యమసూతి కొంతయుఁ

స్వచ్ఛయశంబుగాంచి యిటు ♦ సల్పెనటన్నను సవ్యరేజనుల్.

దుర్యో—అట్లయిన నింక నాలస్యమేల?

శకు—తక్కిన సంగతులన్నియు మా దుర్యోధనుఁ డింతకుమున్నె చెప్పియున్నాఁడుకదా? ఇఁక నాటఁ బ్రారంభింపుము?

ధర్మ—(పాచికలు పుచ్చుకొనును.)

దుర్యో—ఇదిగో! పందెముగా నవరత్నఖచితములగు వివిధశస్త్రవస్తువులఁ బెట్టినాను.

ధర్మ—(పాచికలువైచి) గెలుపు నాయది.

శకు—తీసికొనుము.

దుర్యో—పందెమొడ్డుము?

ధర్మ—దేవబ్రాహ్మణక్షేత్రములు తప్ప నారాజ్యమంతయు నొడ్డితిని.

శకు—(పాచికలుకలిపి) చూచుము. పందెము మాయదే.

ధర్మ—(తనలో) జూదమున నెన్నఁడును నపజయంబెఱుంగని నాకు నేఁడిట్లయ్యెను.

శకు—ధర్మనందనా! దీర్ఘాలోచనము చేయుచుంటివేమి?

తే. గీ. సకలభాగ్యయుతంబైన ♦ క్ష్మాతలంబు
జూదమునిడి యోడినాఁడవు ♦ పార్థివేంద్ర
యొడ్డుటకు నింక నేమైన ♦ నుండెనేని
యాడెదే యేయుపాయము ♦ నైనఁ గాని.

ధర్మ—(ఆవేశముతో)

చ. నిజబలశౌర్యమేర్పడఁగ ♦ నీలు మాహిష్మతి పట్టణాధిపున్
గజిబిజిజేసి, సంగరము ♦ ఖంబునవీరుని శూరసేనునిన్

భుజబలమూర్చి వినోదమున ♦ భోజనిసత్కృతులందె, నట్టిమా
ద్విజుఁడు గుణాకరుండు సహ ♦ దేవుఁడు పందెముగాఁగనిచ్చెదన్.

శకు — ఇదిగో — పందెము — (పాచికలుచూచి) ధర్మరాజా! మేము
గెల్చితిమి.

ధర్మ — అట్లనా! కానిమ్ము. ఇదిగో! బర్బరమాళవ దేశవాసులను జ
యించి పుష్కరప్రాంత నివాసదుర్మదులను గెల్చిన నకులుని
బణముగాఁ బెట్టితిని.

శకు — (పందెమువైచిచూచి) రాజా! ఏమిది! నీకొక్క పందెమైన
ను వచ్చుటలేదే!

ధర్మ — (ఆవేశముతో)

మ. వ్రీతవింధ్యక్షితిపాలనాథునకు దో ♦ ర్దర్పంబుఁజూపించి, సం
తతశౌర్యాన్వితుఁడౌచు నుబ్బినపులిం ♦ దక్షాత్మవతిం గెల్చి, యు
ద్భటసంగ్రామతలంబునందు భగద ♦ త్తున్ మన్ననంజేసి, సు
స్థితకీర్తింగొనినట్టి యర్జునుఁడు ని ♦ ల్చెన్ బందెమై యిచ్చటన్.

శకు — (పందెముకలిపి) రాజా! నీయందు దైవ మనుకూలుఁడై లేఁడు.

ధర్మ — కానిమ్ము — (ఆవేశముతో)

మ. ప్రకటస్ఫూర్తి విదేహభూమిపతి ♦ దర్పంబార్పెఁదోర్ద్రోభుజా
గ్రికసత్కారగదన్ రణంబున దశా ♦ ర్ణక్ష్మావతిం గెల్చెరో
షకషాయంబును గ్రోలి మాగధుజరా ♦ సంధున్ మదాంధున్ వికా
వికలైగూలఁగఁ జేసినట్టి త్రిజగ ♦ ద్వీరుండు భీముండు మా
మకవాక్యంబున నిల్చెఁగావుతఁ బణం ♦ బై యిందు మోదంబునన్.

శకు — (పాచికలుకలిపిచూచి) ధర్మరాజా! ద్యూతకళాకుశలుఁడవగు
నీవు నేఁడిట్లాడుచుంటివేమి? లెక్కకొక్క పందెమైనను నీవు
గెల్చుటలేదు.

ధర్మ—(తనలో) ఏమి! ఈయాశ్చర్యము! (ఆవేశముతో)

తే. గీ. తెలిసియుండియు సకలంబు ♦ ధీరులెల్ల
చూచుచుండ, దురోదర ♦ మందుఁజొచ్చి
రాజ్యమును నోడి భుజవరా ♦ క్రమధనులగు
దమ్ములనుగూడ నింక నిం ♦ దెమ్మునిడిన
నేన పణముగా నిప్పుడు ♦ నిలిచినాఁడ.

శకు—ఇది బాగున్నది—(పాచికలుకలిపి) ఈపందెముగూడ మేమే గెల్చితిమి. ధర్మతనూభవా! ఇక్కడకు సమస్తరాజ్యమును దమ్ములను నోడి, నీవుగూడ నోటువడితివి. ఇంకనొడ్డుటకేమున్నది. మాయేవురకును బ్రియసఖగు పాంచాలినిగూడ నొడ్డెదవాయేమి? అట్లొనర్చి యీపందెము గెల్చితివేని యింతకుమున్ను నీవోడిన రాజ్యమునంతయు నిచ్చివేసెదము.

ధర్మ—(తనలో) చెడ్డకాపురమునకు ముక్కేమిటి? (ఆవేశముతో)

మ. స్థిరశోభన్ ద్రుపదక్షితీంద్రు పావకే ♦ దిన్ జన్మముం గాంచి భా
స్వరశౌర్యంబున నమూదులోకములగా ♦ ల్వాజాలు పాండుక్షితీ
శ్వరపుత్రుల్ పతులై దెలంగ నవనిన్ ♦ సత్కీర్తిఁ జెన్నొందు సుం
దరనీలోత్పలనేత్రి నొడ్డితి నహా ♦ దైవంబు పేరేమగన్.

శకు—(పందెమువైచి) యుధిష్ఠిరా! ఈపందెముగూడ మేమే గెలిచితిమి.

దుర్యో—(విదురునిఁగాంచి) విదురా! నీవరిగి మాకు దాసియైన పాంచాలిని సత్వరముగఁ దోడ్కొనిరమ్ము.

విదు—(కోపమున) దుర్యోధనా! వినాశకాలమున విపరీతబుద్ధులు పుట్టును. కాకున్న ద్రౌపదియేమి, నీకు దాసియగుటయేమి! నీకుఁదారతమ్యజ్ఞాన మించుకయైన లేదే! మాయాదురోదరమున

నోడినయంతమాత్రమున పాంచాలరాజనందని నీకు దాసి యయ్యెనుగా—(ఎదుట భీమునిఁజూపుచు) అదిగో! కల్పాంత కాలఫాలలోచనునివిధాన కోపాగ్నినిఁ బ్రజ్వరిల్లఁ జేయుచున్న భీమునిఁగంటివా? అతనినిచ్చట వారింపఁగలవారెవ్వరు?

చ. కురుకులమందుఁ బుట్టి నృప ♦ కోట్లునిరంతరముగా భజింప, వి
స్ఫురితశతానుజాండవయి ♦ భూరియశోవిభవాభిలాషివై
పరగెడునీవు నేఁడిటుల ♦ పాండవపత్నినిఁ బల్కఁజెల్లునే
దురితమఁటంచు నీమదికిఁ ♦ దోఁచకయున్నదె ధారుణీశ్వరా.

దుర్యో—విదురా! నీవుతిన్నయింట వాసముల నెన్నుఘనుఁడవు; నీకు మా పోషణమంతయు సర్పమునకుఁ బాలువోసిపెంచినట్లున్నది. (ప్రక్కఁజూచి) ఎవఁడురా! అక్కడ!

దుర్యో—నీవుపోయి, యిక్కడజరిగిన విషయమంతయుఁ దెలిపి, ద్రౌపది నిటకుఁ దోడ్కొనిరమ్ము.

ప్రాతి—(నిష్క్రమించి—వెంటనే ప్రవేశించి) రాజేంద్రా! నేనరిగి పాంచాలికి భవదాజ్ఞదెలుపగా “జూదమున భార్యనోడినవాఁ డెవ్వఁడునులేఁడు. అయినను ధర్మనందనుఁడు ముందు తన్నోటు వడి, నన్నొడెనో, లేక నన్నొడి తన్నోటువడెనో, కనుంగొని రమ్మ”ని చెప్పెను.

దుర్యో—ఓహో ! ఇదియొక సందేహము. సరే; సందేహనివారణ మిక్కడ కాఁగలదు. రమ్మనుము—

ప్రాతి—(నిష్క్రమించును)

దుశ్శా—(ఎదుటఁజూచి)—దుర్యోధనునితో అదిగో! ద్రౌపది వచ్చి యిచ్చటకు రావెఱచికాఁబోలు, దూరముగా నిల్చియున్నది.

దుర్యో—(దుశ్శాసనునిఁజూచి)కులటకింతభయమేల! నీవరిగి తోడి తెమ్ము!?

దుశ్శా—(కొంతవడకరిగి—ఎదుటఁ జూచుచు—ద్రౌపదినుద్దేశించి)

ఏమిది! నన్నుఁజూచి సిగ్గుపడిదూరముగాఁ బోయెద వేల?

మ. తరుణీ! నన్నని యేడ కేగెదవు భ ♦ ర్తల్ నిన్ను మాకున్ దురో

దరమందోడిరి దాసివైతివిక దా ♦ తథ్యంబుగా, నింక నీ

కరణిన్ భీతినిఁబొంద నేటికిఁగురు ♦ క్ష్మానాథ ర్త నిన్ జూడగాఁ

బరమామోదముతోడనుండ, నదిగో ♦ పద్మాక్షి! రారమ్మికన్.

(నిష్క్రమించును.)

(తెరలో)

దుశ్శాసనా! నన్ను నవమానింపవలదు. నేనేకవస్త్రను. రజస్వలను.

దుశ్శా—(ద్రౌపదికేశములు పట్టుకొని యీడ్చుకొనివచ్చి) ఏకవ

స్త్రవా? ఏవురుభర్తులతోనున్న నిన్నువిగతవస్త్రనుఁజేసి తెచ్చి

నను పాపములేదు.

ద్రౌప—(దుఃఖముతో) ఓ సభికులారా! విధిబలవంతముచే ధర్మ

సంభవుఁడు మాయాద్యూతమున నన్నోడిననోడుగాక! ఈడు

రాత్ముఁడగు దుశ్శాసనుఁడు నన్నీరీతినీడ్చుకొని వచ్చుటతగునే!

ఇయ్యదిధర్మమే?

భీమ—(ధర్మరాజునుఁజూచి) అన్నయ్యా! మమ్మునల్వురను జూదము

నందు నీవోడినందుకు విచారము నాకావంతయు లేదు, వీరును

మ్మెమిసేయుగలరు? కాని, ద్రౌపదిని పణముగానిడి యోడి

తివే? ఇప్పుడు నీబాహువులు ఛేదించినను పాపములేదు.

అర్జు—(భీమునిఁజూచి) అగ్రజా! జూదమాడువారి కొక్కొక్కసమ

యమున యుక్తాయుక్తవిచారముండదు.అదియుంగాక; ధర్మనం

దనుఁడు ధర్మము తప్పువాఁడు కాఁడు.

భీము—(సభ్యులనుజూచి)

తే. గీ. సాధ్వియైన యీద్రుపదరా ♦ జసుతనిట్లు
బరిభవంబు నొనర్చిన ♦ పాపరతుని
బట్టిశిక్షించుటదిత్కృణ ♦ పాడియగును
భీమునకటంచు నెంచుఁడీ ♦ విజ్ఞులార.

(పాంచాలినిజూచి)

శా. ఏణీలోచన! యెంతపాటొదవెఁగా ♦ నీచూడుమా నన్ను నీ
వేణీబంధముబట్టి యీడ్చినఖలుఁ ♦ విజ్ఞానహీనుఁ రణ
క్షోణిఁ బట్టివధించి నమ్మదము నీ ♦ కుంగూర్చెదఁ గౌరవ
క్షోణీశాధముఁ డెంతయుఁ మనములోఁ ♦ గుందంగ నిక్కట్టునఁ.

(దుశ్శాసనునిమీఁదికి పోఁబోవును)

అర్జు—(వారించి) అన్నయ్యా! పరాక్రమమునకిది సమయముకాదు.

విక—(సభ్యులనుజూచి) సభ్యులారా! పతివ్రతాశిరోమణియగు నీ ద్రౌపదిని నిండుసభయందిట్లు పరాభవింపవచ్చునా? అందఱి కిని వాదువాండ్రకలరుకదా? ద్రౌపదియడిగిన ప్రశ్న కొక రును బ్రత్యుత్తరమీయరేల?

కర్ణ—బాలుఁడవగు నీకీవిషయమేల! కులటయగు నీపెవిషయమున నంతగా రోషించఁబనిలేదు. అయిన నీధర్మసందేహము ని న్నెవరు దీర్పుమనికోరిరి

విక—పెద్దల కెదురుపలుకవలసి వచ్చినందులకు క్షమింపవలయును. ధర్మసందేహము దీర్చుట కొకరిచే నాజ్ఞాపింపఁబడ నవసరము లేదు. సభయందేదైన ధర్మసందేహము కలిగినచో దానిందె లిసియుండియుఁ జెప్పకపోయినచోఁ బాపమందురు. ఈ పెద్దల టయుని మీరాపదించిరి అగుఁగాక! ఇట్టిపరాభవము సేయుప

చున్నా? ధర్మనందనుఁడు విధిప్రేరణమున మాయకురోదరము
నకు గడంగి వారియెత్తురకును బ్రియమగు నీపాంచాలిని బణ
ముగానిడి యోడినాఁడు. జూదము, వేట పానము—మొద
లగు దుర్వ్యసనంబులయందుఁ జిక్కినప్పుడు దేహా[illegible] తెలియ
క ధర్మబంధులుకూడ నొక్కొక్కసమయమున ధర్మముదప్పి
వర్తింతురు. దానిం బాటింపఁబని లేదు. ఆ కారణమునఁ బాంచాలి
యధర్మవిజిత కాని ధర్మవిజిత కాదు.

కర్ణు—(ఇంచుక యూరకుండి) పెద్దలకుఁ దెలియని ధర్మములు నీకుఁ
దెలియును కాఁబోలు. అనవసరసంభాషణ మాపుము.

దుర్యో—(దుశ్శాసనునిఁజూచి) తమ్ముఁడా! ద్రౌపదీపాండవుల వస్త్ర
ములు విప్పుము.

(పాండవులు తమతమ యుత్తరవస్త్రముల నచ్చటఁబెట్టుదురు.)

దుశ్శా—(ద్రౌపదిని సమీపించి) నీచేలమునువిప్పి యచ్చటఁబెట్టుము?
(లాగఁబోవును.)

ద్రౌప—(తప్పించుకొని పాండవులఁజూచి) ఓహో! పాండవేయులారా!
దుష్టచిత్తుఁడగు దుశ్శాసనుని దుష్కృత్యమును వారింపఁదలంప
రేల? ఈమూఁడులోకములయందు మీ పరాక్రమమున కెదురు
లేదు. ఇట్టిదుర్మదాంధులను శిక్షింపక యూరకున్నచోఁ బతివ్ర
తల మానరక్షణమునకు మార్గముండదు. ఈకులపాంసనుఁడు సా
ధ్వినగునన్నిట్లు పరాభవించుచుండఁగా మీరుచూచి యోర్పు
వహించుట తగునే? వాయునందనా! నీగదాపాండిత్యము ప్రక
టించుట కిదియేకదా వేళ. మహేంద్రకుమారా! నీవు గాండీవ
ధారివై రణంబున నిల్చితివేని యెవ్వరెదిరింపఁగలరు? మాద్రే
యులారా! కాలవ్యాళముల లీలనొప్పు మీ కృపాణముల నొర
లనుండి తీయరేల? అక్కటా! ద్రుపదతనూజవల్లభునకు వర

మున నగ్నికుండమునజన్మించి త్రిలోకవీరుఁడగు ధృష్టద్యుమ్ను నకు సోదరినై మహాబలపరాక్రమవిరాజితులగువారికు సతినై యుండియు నేనీరీతిని నిండుసభయందు బరాభవ మందవలసిన దేనా? అహా! కాలవైపరీత్యము!

ధర్మ—(ద్రౌపదినిజూచి) ఓదుపదరాజపుత్రీ! విధివిపరీతమున మాయజూదమున సర్వముఁగోలుపోయి ధర్మసంధతకుఁ గట్టుబడియుంటిమి. నీనాథులొక్కసారి క్రోధమున నమ్మొగమునఁ జూచిరేని శత్రుసంహారమునకు నిమిషమాత్రమైన పట్టదు. కాలక్రమమున నీవట్టిదిచూడఁగలవు. ప్రస్తుతము నీ దారుణవాక్యములచే మాకు రోషముగలిగించి సత్యసంధతకు భంగమొదవింపవలదు. ఇప్పుడా ర్తజనశరణ్యుఁడగు మాధవుఁడే నీకు రక్షకుఁడగుఁగాక.

భీష్మ—(తనలో) ఈతనిధర్మసంధత యెంతయు వినుతింపవలయును.

దుశ్శా—(ద్రౌపదిపలువ లాగుచున్నాఁడు.)

ద్రౌప—(శ్రీకృష్ణుని నుద్దేశించి)

మ. వరధర్మవ్రతపాశబద్ధులయి! నా ♦ ప్రాణేశ్వరుల్ నేఁడు నన్
బరరక్షింపక యూరకుండిరికదా ♦ భాగీరథీపుత్రుఁడున్
గురుఁడున్ నోరుమెదల్పరైరి యిఁకనీ ♦ కుంజెల్లు నన్ గావ నీ
చరణాబ్జంబుల నాశ్రయించితిని కృ ♦ ష్ణా! యార్తరక్షామణీ.

దుశ్శా—(వలువలాగి) రెండుచీరెలు ధరించితివా యేమి?) మరల లాగుచున్నాఁడు.)

ద్రౌప—(శ్రీకృష్ణు నుద్దేశించి)

మ. దురితంబుంచుఁ దలంపకే యొకట యీ ♦ దుష్టాత్ముఁడీ భంగి నన్
బరిభావింపఁ గడంగినాఁడు కరుణన్ ♦ కాలింపవే నీదుసో
దరినాదున్ గద భక్తరక్షణకలా ♦ దక్షుండవా నీదు ప

చ్చరణాబ్జంబుల నాశ్రయించితిని గృ ♦ ష్ణా! యార్తరక్షామణీ,

దుశ్శా—ఏమిది! చీరమీద జీరగట్టితివే. ఎంతటి జాణవు. ఏకవస్త్ర
నని బలికితివే. (మరలలాగును.)

ద్రోణ—వాసుదేవ! పాంచాలరాజపుత్రి మానసంరక్షణమున కిది
యే సమయము. దుర్మదపరిపంథి దుర్వారగర్వోద్రేక మారణ
మున కిదియే సమయము. ద్రౌపది మహాసాధ్వియని కీర్తిడిండిమ
మ్మ్రోయఁ జేయుట కిదిసమయము. కృష్ణా! రక్షింపుము.

దుశ్శా—(యథాప్రకారము జేసి) అబ్బా! ఇన్నివలువలున్న వేమి? నీకడ
నేదియో మంత్ర మున్నట్లున్నదే? వలువలు విప్పుటకు విసుగు
పుట్టుచున్నది.

భీష్మ—(ద్రోణునిఁజూచి) ఆచార్యా! వాసుదేవుని కృపఁగంటిరా?

సీ. ఈవును నేను గల్గి యుట ♦ నేమియొనర్పఁగఁజాలిన ముదు
ర్ఘావుఁడు(ధృతరాష్ట్రునిఁజూచి) గుడ్డిజేఁడితఁడు ♦ పాపచరిత్రుఁడు
గాకయున్న మీ

దావహమానసుండగుచు ♦ ధర్మజురమ్మని పిల్పించుచునే
యీవిధిఁ జూదమాడుటకు ♦ నీతనిఁ ద్రిప్పెదఁ గాక యిప్పుడే.
(కత్తిదూసి ధృతరాష్ట్రునిమీఁదకుపోఁబోవును.)

విదు—(వారించి) మహాత్మా! కౌరవులకు వినాశకాలము సమీ
పించినది.

ధృత—విదురా! ఈకోలాహలమేమి?

భీమ—ఓయీ! గుడ్డిజేఁడా! నీకుఁ గన్నులుం లేవుగాని వినుటకుఁ జెవు
లుం లేవా? పాంచాలి యేడుపు నీవు వినలేదా; ఇంతపయున్న
వచ్చినది; కానిమ్ము (సభ్యులఁగలయఁజూచి.)

మహాస్రగ్ధర.

కురువృద్ధుల్ గాంచుచుండన్ ♦ కుటిలహృదయుఁడై
గొంకు లేకుండఁగా నా
దరిఁ బాంచాలతనూజా ♦ పతినయను నిటుల్
ధైర్యముల్ బాపియాజిన్
బరిభావించంగ దాయా ♦ పరమదురితునిన్
బాహుదర్పంబుచే భీ
కరలీలన్ జెండి తద్వ ♦ క్షరుధిరమును నే
గాంక్షతోఁ ద్రావిమింతున్.

ఇది యేనా ప్రతిజ్ఞ.

దుర్యో—ప్రతిజ్ఞలకేమి! ఎన్నియైనను జేయవచ్చును.

విదు—(ధృతరాష్ట్రునిఁ జూచి) ఇదియంతయు నీమూలమున గలిగినది. కురువంశ మడఁగుకాలము సమీపించినది. నీకుమారుఁడగు దుశ్శాసనుఁడు పాంచాలిని బరాభవింప బలవంతముగ వలువ లీడ్చినాఁడు.

ద్రౌప—పూజ్యులగు నోసభ్యులారా! పతివ్రతనగు నేనిట్లు నిండు సభయందుఁ బరాభవింపఁబడుచుండ మీరందఱును సహించి యూరకొనుట ధర్మమా? ఒకవేళ ధర్మనందనుఁడు మాయజూదమున నన్నోడుటంజేసి వీరికి దాసినేయగుదుగాక! ఇట్లు పరాభవింపవలయునా?

భీష్మ—అమ్మా! ద్రుపదకుమారీ! మేము బ్రదికియుండియుఁ జచ్చిన వారిచందమున నుంటిమి. కాని, నీవస్త్రాపహరణము కురుకులనాశనవృక్షమునకు బీజమగును.

భీమ—పితామహా! నీవాక్యము ఫలించుగాక!

కర్ణు—(నవ్వుచు ద్రౌపదిని జూచి) ద్రౌపదీ! ఈమ్మడిగొడ్డువిధమున నసమర్థులగు పతులతో నేమి కాపురము జేసెదవు? సమర్థుఁడైనవాని నింకొకనిఁ గైకొనుము.

దుర్యో—(ద్రౌపదికి తొడం జూపించును.)

భీము—(కోపముతో) ఓరీ! దుర్యోధనా! ఈపతివ్రతను నీయూరుప్రదేశమునఁ గూర్చుండుమని సైగ జేసెదవుగా?

మ. అతిగర్వోద్ధతిఁ గన్నుమూసికొని యా ♦ మాయుత్తచిత్తంబునన్
సతిసం భారతభూమినాథతనయున్ ♦ సాధ్వీమణిం గాంచి మా
నతిఁ జేసన్నయొనర్చినట్టి కుమతిం ♦ గౌరవ్యరాజేంద్రు భ
గ్నతరోరుం బొనరింతు భీకరగదన్ ♦ సంగ్రామరంగంబునన్.

(మీఁదకుఁ బోవును)

భీష్మ—వత్సా! శాంతింపుము.

అర్జు—అన్నయ్యా! పరాక్రమప్రకటనమున కిదిసమయము కాదు.

ధృత—(తనలో) ఇప్పుడు నేనేమి చేయుదును? (ప్రకాశముగా) కుమారా! సుయోధనా! ఎంతటిదుష్టుఁడవైతివిరా! సాధ్వీనిట్లు పరాభవింతువా? ఇంకనీమొండగము చాలింపుము. (ద్రౌపదిని జూచి) అమ్మా! ద్రౌపదీ! దుర్మతులగు నాతనయులొనర్చిన దుష్కృతినిమన్నించి నీకెట్టివరములు కావలయునో కోరుకొనుము?

ద్రౌప—దేవా! నాకు వరము ప్రసాదింప నిచ్ఛయుండెనేని ధర్మరాజును దాస్యమునుండి విముక్తుఁ జేయుము.

ధృత—అట్లె యగుఁగాక! మఱియొకవరముఁ గోరుము?

ద్రౌప—అతనితమ్ములు నలువురు తమతమ యస్త్రశస్త్రములతో దాస్యవిముక్తులు గావలయును.

ధృత—ఆవరముగూడ నిచ్చితిని. మఱియొకవర మడుగుము.

ద్రౌప—దేవా! క్షత్రియకాంతకింతవఱకే యధికారము.

ధృత—అమ్మా! నీసౌశీల్యమున కెంతయు మెచ్చితిని. ధర్మనందనుఁ డిప్పుడోడిన రాజ్యశ్రీల సర్వము నిచ్చితి—(ధర్మరాజుంజూచి) యుధిష్ఠిరా! నాకుమారులు మీయెడల జేసిన యెగ్గులను సైరించి యింద్రప్రస్థపురమున కరిగి సుఖముగా నీరాజ్యముఁ బాలింపుము.

ధర్మ—మహాప్రసాదము.

దుర్యో—(శకునితో రహస్యముగా) మామా! మనము పడినకష్టము తుదకిట్లయినది; కానిమ్ము. ఈసారి మరల జూదమున కాహ్వానించి, యోడినవారు పండ్రెండేండ్లు వనవాసమును నొక్కయేడజ్ఞాతవాసమును చేయునట్లుశపథముఁ జేసికొనిపీరినోడింతమురండు.

(తనయనుచరులతో నిష్క్రమించును)

భీమ—(ధర్మరాజునుజూచి) అన్నయ్యా! ఈయంధుఁడు రాజ్యమిచ్చుటయు నీవుగొనుటయునా?

మ. దురితాత్ముండగు నంధుఁడట్లనఁగ సం ◆ తోషంబునుం బొంగుచున్
బరిభావంబు దలంపకే యకట యూ ◆ పం జెల్లునే శిష్టముల్
దరుణీదివ్యకటాక్షలబ్ధమగు నీ ◆ ఖ్యాతిప్రతలం బిప్పుడున్
బరిపాలింపఁదలంతువే మిగుల ద ◆ ర్పంబుండగా నగ్రజా!

అర్జు—అన్నయ్యా! ఇప్పుడీ విచారణ మెందుకు! పాంచాలిమూలమున వచ్చినదని తలంపనేల? పెదతండ్రిగారు కరుణించినదని తలంపరాదా?

ధర్మ—(ధృతరాష్ట్రునిఁజూచి) తండ్రీ! మేము పోయి వచ్చెదము.

(అందఱునిష్క్రమింతురు.)





# పాండవాజ్ఞాతవాసము.



## చతుర్థాంకము.



రంగము:—[ఇంద్రలోకమున మందిరములో అర్జునుఁడు-ప్రవేశము.]

అర్జు—(తనలో) విచిత్రచిత్ర నిర్మిత సౌధంబులును, మణిగణవిరాజిత గవాక్షంబులును, రత్నదీప్తిధగద్ధగాయమాన రాజమందిరములును, అభేద్యపరిఘాప్రాకార ద్వారకవాట చమత్కారహర్మ్యంబులును, నానాధూపదీపవిరాజితదేవాలయంబులును, కుసుమఫలభరితతరునిచయారామంబులును, కలహంసకారండవచక్రవాకచకోర కైరవపుండరీక కోకనదవిరాజితసలిలాసారంబులగు కాసారంబులును, వివిధ విచిత్రశుకపికశారికామయూర కోలాహలంబులును, మదమాతంగపంక్తియు, మహారాజ్యలక్ష్మీసంప్రాప్తకారణంబులగు తురంగంబులును, హేమస్యందనంబులును, భిండివాలపరిఘపట్టిస ప్రాసఖడ్గతోమరాద్యాయుధపాణులైన వీరభటవర్గమును, దేవవేశ్యాబృందమును గలిగి చింతామణికామధేనుకల్పవృక్ష విభాసితంబగు నీయమరలోకమున నెన్నాళ్ళుండినను నుండవలయునని యే కోర్కెయుండును. కాని కామ్యకవనంబున ద్రౌపదీసమేతులయిన నాసోదరులెట్టుండిరో, నేనింకను రాలేదని యెంత చింతించుచుండిరో

నాసోదరు లరణ్యమున గష్టపడుచుండఁగా నిఁక నే నీయమరలో
కమున సుఖములనందుచుఁ దడవుసేయుటకుఁ జిత్తమంగీకరింప
కయున్నది. మహేంద్రుఁడు నాకెప్పుడనుజ్ఞ యిచ్చునో?

(ఊర్వశి ప్రవేశించును)

ఊర్వ—(తనలో) పాండవమధ్యముఁడయిన యర్జునుండీ యమరలోక
మునకువచ్చి యీమందిరమున విడిసియున్నవాఁడని వింటిని.
ఆభువనమోహనవిగ్రహుని సందర్శించి కృతార్థురాలనయ్యెద
నుగాక—(అర్జుననిసమీపించి) భరతకులదీప! ధనంజయా!
నీకుజయమగుఁగాక!

అర్జు—(చూచి-తనలో) ఓహో! ఈమె దేవవేశ్యయగు నూర్వశి. ఈ
సమయంబున నిచ్చోటి కేల యరుదెంచెనో!

ఊర్వ—(తనలో) ఈతఁడు నన్నుజూచి యేమిరా యాలోచించుచు
న్నాఁడు. ఓహో! విన్నదానికంటె నీతనిసౌందర్యము రెండింత
లధికముగనున్నది.

సీ. సంపూర్ణపూర్ణిమా ♦ చంద్రబింబమని వ
ర్ణింపఁగాఁదగువీని ♦ నెమ్మొగంబు
పరిపుల్లసరసిజ ♦ ప్రసవంబులను భా
వింపఁగాఁదగువీని ♦ వీక్షణములు
నవ్యమృణాలకాం ♦ డంబులవినుతింపఁ
దగువీని దృఢభుజా ♦ తల్లజములు
చిత్తసంభవుహేమ ♦ సింహాసనంబని
వినుతింపఁగాఁదగు ♦ వీనియురము

తే. గీ. నలువతొలుదొల్త నాసత్య ♦ బలభిదాత్మ
జాదుల సృజించి మోదంబు ♦ నంది మఱియు

దనవిజహ్రీధిమేఱయు నీ ♦ తనివృజింప
జరుగు గాకున్న గలదె యీ ♦ చక్కఁదనము.

(ప్రకాశముగా) అర్జునా! ఆలోచించుచుంటి వేమి?

అర్జు—నన్నుఁ గృతార్థునిఁజేయఁ దలచివచ్చిన నీకు నమస్కరించుచున్నాను.

ఊ—(తనలో) ఈతఁడిట్లు పలుకుచుండ నేమి? (ప్రకాశముగా) అర్జునా!

తే. గీ. పంచువెన్నెలమదికిని ♦ నిందుముఖము
గోలుపుచుండె; మందమలయా ♦ నిలము వీవ
సాగె; నట్టిచో నొకఁడవే ♦ సౌధమందు
బవ్వళింపఁగఁదలఁచితే ♦ పార్థ! యిపుడు.

ఇట్టిశరద్రాత్రియందు—ఆహా! ఒక్కఁడవా యుండుట!

అర్జు—అమ్మా! ఒక్కఁడనుండిన నేమి?

ఊ—ఇట్టివేళయందు జిత్తము నీవెట్లు పదిలపఱచుకొంటివి? (ఆకసమువంకఁజూచుచు) అటుచూడుము చంద్రుఁడు తన సంపూర్ణకళలను నెట్లుప్రసరింపఁజేయుచున్నాఁడో! ప్రాణములకు హాయిగా మారుతుండెట్లు వీచుచున్నాఁడో! ఇట్టిసమయమునందే కదా యనంగుఁడు విరహిణులపై దాడివెడలును. నీవంటివాఁడిట్టిసమయమున శరదిందుసదృశవదనయగు నొక్కపూఁబోఁడినిఁ జేర్చుకొని వానిగర్వము నడంపవలదా?

అర్జు—జననీ! కుమారునియొద్ద తల్లి యిట్టివాక్యములనాడవచ్చునా?

ఊ—ఇది యేమి! అర్జునా! నన్ను జననీయని పలుకుచుంటివి?

అర్జు—నీవు మావంశపుమూలపురుషుఁడైన పురూరవునకుఁ బ్రియురాలవైయుంటివి.

ఊ—ఇదియా! ఎప్పటికాలపు సంగతియో జ్ఞప్తికిదెచ్చుకొంటివి.

చాలు చాలు! వారవిలాసినికి వావులతో పనిలేదు. అర్జునా! పలుమాటలేల?

తే. గీ. అర్జునా! నిన్నుఁగూర్చి నే ♦ నద్భుతముగ
విన్నయప్పటినుండియు ♦ ఘనసరోజ
బాణనిశితాస్త్రతతిచేత ♦ బాధనంది
నేఁడు నిన్నుఁ జేరితినిసుమ్ము ♦ చూడవేల?

అర్జు—హరిహరీ! ఎంతమాట బలికితివి—

చ. జననివినీవు పల్కిన వ ♦ చస్సును మీరఁగరాదుగాని, కూ
డనిపనియెట్లు సేయుదు; హా ♦ తంబును బూనక నన్ను బ్రోవు నా
మనము పరీక్ష సేయనిటు ♦ మానిని! పల్కెదవంచు నెంతుఁ గా
వునఁగృపఁబూనినీయనుఁగు ♦ పుత్రుని నన్ను ననుగ్రహింపుమా!

అమ్మా! నీవు నాచిత్తమును పరీక్షింపనవసరము లేదు. నాచిత్తమెప్పుడును నధర్మపథమునఁ జనదు—

ఊర్వ—అర్జునా! నాయంతట నేను నిన్నుఁ గోరివచ్చితిని.

ఉ. స్వర్గమునందునాకుఁ బ్రీతి ♦ వచ్చెడి దివ్యవిలాసవిభ్రమా
పర్గళమూర్తియైన కుటి ♦ లాలక గల్గదా కాన; నాదు సం
సర్గము నెందుటూ రతిర ♦ సజ్ఞుఁడవై, యిఁక నేనెనీడు సం
సర్గము గోరివచ్చితిని ♦ సత్యముగావిను మింద్రనందనా.

అర్జు—హరి హరీ! అమ్మా! ఇట్టిపలుకులఁ బలికి నాహృదయమును గలంచకుము. నాచిత్తమిట్టి దుష్కార్యమునకు సమ్మతింపదు.

ఊర్వ—పార్థా! నీవిట్లు పలుక ధర్మముగాదు.

తే. గీ. మదనుఁడవయుఁడై నాపైనఁ ♦ బదునుశరవి
తానమునయుంగసాగ, న ♦ ద్దానికోర్వఁ
జాలక కృపజూపెదవంచు ♦ సమ్మోదమునఁ
జేరితిని నన్ను; రక్షింపు ♦ శీఘ్రగతిని.

(సమీపించును.)

అర్జు—(దూరముగాచని) ఆహా! ఇది బాగున్నది. దేవవేశ్యవగు నీవే
ద! మానవలోకవాసుఁడనగు నేనెడ! ఇదియుంగాక; నీవు నా
తల్లివి. నన్నిట్టి యధర్మోద్యోగమునఁ బ్రవేశపెట్టవలదు.
దూరముగనుండుము.

ఊర్వ—అవురా! అర్జునా! నీవెంతకఠినహృదయుఁడవు. మనసార
నినుఁగోరి యరుదెంచిన నారిసాక్షీ యభీష్టముఁ దీర్పక యిట్లు
పలుకుట న్యాయమా? ప్రాణదానముకన్న మఱియొక పుణ్య
మున్నదా? (సమీపించి) పాండవమధ్యమా! మన్మథబాణా
గ్ని కోర్వఁజాలను. రక్షింపుము—(ముట్టుకొనఁబోవును.)

అర్జు—తల్లీ! అట్టిప్రశంసవిడువుము. మఱియెట్టికార్యమునందు నియో
గించినను నేనుచేయుటకు సంసిద్ధుఁడనని యెఱుఁగుము—

ఊర్వ—(కోపముతో) ఛీ! నీవు పురుషుఁడవా? నాయభీష్టముఁదీర్పక
సంతాపవార్ధినిముంచిన నీవు షండుఁడవగుదువుగాక—

(నిష్క్రమించును.)

అర్జు—(తనలో) అక్కటా! ఈమె యిట్లు శాపమిచ్చినది! ఏమిసేయు
దును.

(ఇంద్రుఁడు-ప్రవేశించును.)

ఇంద్రు—వత్సా! నీవును నూర్వశియు సంభాషించుచుండుట నేను
రహస్యముగ డాగి వింటిని. నీచిత్తశుద్ధికి నేనెంతయు సంతో
షించితిని. ఊర్వశియిచ్చిన శాపమునుగూర్చి నీవు విచారింప
వలదు. అయ్యది నీకు ముందజ్ఞాతవాసమున నుపకరించును—
రమ్ము—

(ఇరువురును నిష్క్రమింతురు.)

రంగము:—(ద్వైతవనము:—పాండవుల యాశ్రమము:—ప్రవేశము.
ద్రౌపది—ధౌమ్యుఁడు.)

ద్రౌప—భూసురోత్తమా! మేమున్నట్టివైన నీయిడుములఁ బాసి సుఖింపఁగలమా ?

ధౌమ్య—సాధ్వీమణీ! మున్ను వాసుదేవుఁడభిమన్యాదికుమారవర్గముతో సుభద్రను ద్వారకకు దీసికొనిపోవుటకు వచ్చినప్పుడు నీతో "అజ్ఞాతవాసానంతరమున ధార్తరాష్ట్రులను నీపతులు వధించు నప్పుడు రక్తప్రవాహములఁ గాంచి యానందింతు" వని పలికిన వాక్యములు మఱచిపోయితివా ?

ద్రౌప—అజ్ఞాతవాసానంతరమునైనను ధర్మనందనుఁడు రణమున కనుమతింపవలయునుగదా? సమరమునఁగాని కార్యము చక్కఁబడదు.

ధౌమ్య—అవును; ఆమాటనిశ్చయమే. మనకు మంచిదినములు సమీపించుచున్నవి. భీమునిచేఁ గావింపఁబడిన కిమ్మీరవధయు కిరాతవేషమున హరుఁడు పార్థునకుఁ బాశుపతాస్త్ర మొసంగుటయు, అర్జునుఁ డింద్రలోకమునకరిగి నివాతకవచులఁ గూల్చుటయు సౌగంధికార్థమై యరిగిన భీమునకు హనుమంతుఁడు ప్రసన్నుఁడై మీకును గౌరవులకును జరుగనున్న సంగ్రామమున నర్జునుని రథముపై నిలిచి సమస్తము జూచుచుందు ననని చెప్పుటయు, వాయునందనుఁడు జటాసురుని వధించుటయు నిందులకు సాక్ష్యము లిచ్చుచున్నవి,

ద్రౌప—అరణ్యమున నున్నను సుయోధనుఁడు మాకెగ్గు సేయుటకే తలంచుచుండునుగదా ?

ధౌమ్య—అమ్మా! ఎవరు చేసిన పాపము వారే యనుభవింతురు.

ద్రౌప—(ఆకసమువంకఁజూచి) పొద్దెక్కినది, వేటకరిగిన పతు లింక
ను రాలేదు.

ధౌమ్య—నేనరిగి వారిజాడ నరసివచ్చెదఁగాక (నిష్క్రమించును.)

(సైంధవుఁడు—ప్రవేశము.)

సైంధ—(తనలో) ఆశ్రమమున పాండవులు లేరు. ద్రౌపది యొంటరి
గనే యున్నది. (ద్రౌపదినిఁజూచి)

తే. గీ. ఇట్టి లోకైకసుందరి ♦ యొందు లేదు
పార్షతతనూనాధుత ♦ తఃఫలంబె
యిట్లు జనియించునంచును ♦ నెంచవలదె
పాండవులభాగ్యమునఁగాదె ♦ పత్నియయ్యె.

(సమీపించును.)

ద్రౌప—(సైంధవునిఁజూచి) అన్నా! సింధురాజా! ఎప్పుడువచ్చితివి?
ఇటఁ గూర్చుండుము?

సైంధ—అన్నా! దుస్సలకుఁ గుశలమే గదా? హస్తినాపురమునకుఁ
బోవుచువచ్చుచుంటివా? వృద్ధులగు గాంధారీధృతరాష్ట్రులు
సేమముగనున్నవారె? ఇప్పుడు నీవెచ్చటికరుగుచుంటివి?

సైంధ—అందఱికిని సేమము. నేను సాల్వకన్యాస్వయంవరార్థమైయరు
గఁదలఁచి సేనలతో బయలుదేఱితిని. కాని నాచిత్తమిక్కడకు
వచ్చినపిదప నాయుద్యోగమునుండి మరలినది.

ద్రౌప—అందులకుఁ గారణము.

సైంధ—ఏమున్నది? బంధుకోటిలోన దానవు కదాయని నిన్నుఁజూచి
పోవుటకువచ్చితిని. నిన్ను జూడగనే నాధైర్యస్థైర్యములు చెడి
నవి. చెప్పవచో నాయందుఁ దప్పక కరుణింతువను నమ్మకము
మాత్రము నాకున్నది.

చ. స్మరుఁడుగ్రుండయి వేఁడితూపులదరిం ♦ పఁగ దచ్ఛితాస్త్రశిఖి
జ్వరబాధంబడఁగ నన్ను నెంతయు ధృతి ♦ శ్రీహీనచిత్తుండనై
కరుణావర్షము దప్పకుండఁగుఱియం ♦ గాఁ జేతువీవంచు నీ
సరసం జేరితి నాదరింపఁదగు నో ♦ శాతోదరీ సుందరీ!

మ. అనుమానింపక పల్కుచుంటి నినుమా ♦ యబ్జాతపత్రాక్షి! కా
ననమందీవిధినుంటచేత నిను నా ♦ న్వాల్పట్టలేనైతి నే
మనుదున్ వేరొక దుర్వ్యాపారము ద్వదీ ♦ యాత్మన్ విసర్జించి నా
వెనువెంటన్ జనుదెమ్ము దుస్సలవలెన్ ♦ వీక్షింతు వేయేటికిన్.

దుర్జయులు దరిద్రులు నైన పాండవులతో నీయరణ్యమున నిడుమల బడుచుండుట నీసౌందర్యమున కెంతయు గళంకముగనున్నది.

తే. గీ. జూదమున నిన్ను గోల్పోయి ♦ మోదమలర
పరుడు నీకట్టుపుట్టము ♦ ల్వాంగఁజూచి
సైచినట్టి పాండవులపై ♦ జలజగంధి
ప్రేమనిట్లుచూపెద వేల ♦ కేలవగుచు.

నీపతులకంటె నవివేకులెందును లేరు. ఒకసారి జూదమున నోడిపోయిరి కదా! మరల యుధిష్ఠిరుఁడు రెండవసారి యాడుటకేల సమ్మతించెను? తొలుతమీరోడినప్పుడు నీవిషయమై నేనెంత శ్రమనొందితినో దైవమున కెఱుక. మాటలసందర్భమున జెప్పుచుంటినిగాని మఱియొకటి కాదు. దుర్యోధనాదులను రహస్యముగఁబిలిచి చీవాట్లుపెట్టి ధృతరాష్ట్రుని తోఁగూడ జెప్పితిని. ఆతఁడు నామాట దీసివేయఁజాలక మీరాజ్యము మీకిచ్చెను. నావాక్యములననుసరించియే వరము లనునవముగల్పించి నాఁడు. ఇట్టిశ్రమయంతయు నే నెందులకుఁ బడినాఁడనో నీవే గ్రహింపుము. నాయభిప్రాయము వెల్లడించుటకు దగినసమయము నేటికి దొరకినది.

తే. గీ. అదిగొ సైన్యంబు వారథం ♦ బదిగొ రొక్క-
ము! మదినిసంశయంబును ♦ మాని; నీవ
సింధురాజ్యపాలనముఁ జే ♦ సెదవుగాక
సకలసౌఖ్యంబులందుచు ♦ జలజనయన.

తెమ్ము; త్వరగఁబోవుదము.

ద్రౌప—(తనలో) ఈదురాత్మునకుఁబుండుపుట్టినది.(భగవంతునుద్దేశించి) హా! పరమేశ్వరా! అరణ్యములయందున్నను మాకు గష్టములనేగూర్చుచుంటివా? అక్కటా! సైంధవుఁ డిప్పుడిక్కడ కేలవచ్చెను? ఈతఁడువట్టి యవినీతుఁడు. నాపతు లాశ్రమము నలేరు. ధౌమ్యుఁడుగూడ వారినరయ నేగెను. (ప్రకాశముగా) అన్నా! సింధురాజా! కౌరవభగినియగు దుస్సలకు నీవు భర్తవగుటంజేసి నాకు సోదరుఁడవు. అట్టిచో నన్నుఁ గామింప ధర్మమా ?

సైంధ—కామినీమణీ! కాముకులకు యుక్తాయుక్తవిచారణముండదు.

చ. దవశిఖనార్పవచ్చు; యము ♦ దండనసైపఁగవచ్చుఁ; గాలమృ
త్యువును జయింపవచ్చుఁగను ♦ దోయిరమేశునిఁ జూడవచ్చు; ఘో
రవిషమును గ్రోలవచ్చు; జల ♦ రాశులనీదఁగవచ్చుఁ; గాని హృ
ద్భవఘనపుష్పశస్త్రముల ♦ దాడికినిల్తురె యెట్టివారలున్.

ద్రౌప—అన్నా ! నీకు సకల ధర్మములును దెలిసియుండియు నేకారణముచేతనో యిట్టియజ్ఞానాబ్ధిలోఁబడితివి. నీకుఁబరమేశ్వరుఁడు మంచిబుద్ధి బ్రసాదించుగాక! ఇఁకనట్టికోరికవిడిచి పాండవులరుదెంచువఱకును నుండి వారిచేఁ బూజితుఁడవై యరుగుము.

సైంధ—(తనలో) ఓహో! ఈమెకడుజాగుసేయుచున్నది. పాండవులరుదెంచినచో నాయుద్యమమునకు నంతరాయముగలిగించు

టయేగాక యేమిహానికలుగునో! వారు రాకమునుపే యీపాను
దోష్కునిపోవలయును. (ప్రకాశముగా) పల్లవాధరీ! నీచేఁ
బూజితుఁడనైతిని. ఇది చాలును.

మ. అతివా! పాండవులిచ్చుపూజలివియే ♦ లా నాకునీపూజయే
యతిసంతోషముగూర్పునాపయినఁ బు ♦ ష్పాస్త్రుండు కోపంబునన్
శితనారాచములేయఁగా దొడఁగెనీ ♦ చిత్తంబులో బ్రీతిబూ
ని తగన్ వానిశరాగ్ని నార్పుటకుఁ గన్ ♦ లేలెమ్ము జాగేటికిన్.

కాలహరణమునకు నాచిత్తము సైపదు.

ద్రౌప — నీకుమంచిబుద్ధికలుగుటకై నేను శాంతముగాఁ బలికితిని. నా వాక్యములాలింపక మితిమీఱి ప్రేలుచుంటివి. పాండునందనదుర్వారకోపాగ్నికి శలభమవై పోవుటకే నీకిట్టిబుద్ధిపుట్టినది. చిత్తమును మరలించుకొనవేని మరణముధ్రువము.

సైంధ — పాండవులవలన నాకు భయము కలుగునని నీవు సంశయించుచుంటివా? అట్టిసంశయ మవసరము లేదు.

తే. గీ. నీదుభర్తల శౌర్యంబు ♦ జూదమందె
తేటతెల్లంబుగా మాకుఁ ♦ దెలియవచ్చె
వలుపవిద్యామాటంచును ♦ బరునిపాలు
నిన్ను నర్పుటఁ గాంచమే ♦ నీరజాక్షి.

ద్రౌప — ఓరీ! దుర్మతీ! నీకు వినాశకాలము సమీపించినది, పాండవులు వచ్చువఱకును నీవిచ్చటనుండుము. నీబలము తెలియును.

సైంధ — పాంచాలీ! నావాక్యములు విని నీయంతట నీవు నాకు శ్రమ కొసంగకుండ వచ్చెదవేమో యని యింతవఱకును సైచితిని. ఇఁక నిన్ను బలాత్కారముగనైనఁ గైకొనక తప్పదు.

ద్రౌప — ఓరీ! నీచుఁడా! నన్ను బలాత్కారముగఁ గొనిపోయెదవుగా? ఎంతసాహసము! నీకాయువు నిండినది. (తనలో) అక్కటా

నేనిప్పుడేమిచేయుదును? నాపతులలో నొక్కఁడైన రాకుండె
నే? సమయమునకు ధౌమ్యుఁడైన లేకుండెను. హా కృష్ణా! న
న్నీదురాత్ముని బారినుండి రక్షింపుము.

సైంధ—చెలీ! నామాటకేమి ప్రత్యుత్తరమిచ్చెదవు? (సమీపించును)

ద్రౌప—ఛీ! దూరముగనుండుము.

సైంధ—ఇఁక ప్రయోజనములేదు—ఇదిగో చూడుము—(బలాత్కా
రముగ నెత్తుకొనును)

ద్రౌ—ఓరీ! కులపాంసనా! (పాండవుల నుద్దేశించి) పాండవేయు
లారా! ఈ సైంధవుఁడు నన్ను బలాత్కారముగఁ గొనిపోవు
చున్నాఁడు. వేగమవచ్చిరక్షింపుఁడు—(సైంధవునిఁజూచి) ఓరీ!
నన్నుఁ దోడ్కొని యెక్కడికేగెదవో యెరుగుము—ఏదిక్కు
నకేగినను నాపతులు నిన్ను కడఁగింతురు.

సైంధ—(ద్రౌపదితోనిష్క్రమించును)

ధౌమ్యు—(ప్రవేశించి) ఎంతసాహసమెంతసాహసము! (పాండవులను
ద్దేశించి) పాండునందనులారా! ఆశ్రమములో నెవ్వరు లేకుం
డఁజూచి సైంధవుఁడు బలాత్కారముగా ద్రౌపదిని రథముపైఁ
బెట్టుకొనిపోవుచున్నాఁడు. సత్వరముగవచ్చి రక్షింపుఁడు?

పాండవులు—ప్రవేశము.

ధర్మ—ఎక్కడనో స్త్రీగోర్త నాదము వినవచ్చుచున్నదే!

ధౌమ్యు—(తొందరగా) పాండునందనులారా! ఆలస్యముచేసినచోఁ
బ్రయోజనము లేదు. సైంధవుఁడు ద్రౌపదిని బలాత్కార
ముగఁగొనిపోవుచున్నాఁడు.

భీము—(కోపముతో) ఓరీ! సైంధవా! గుహాయందు నిద్రించు సిం
గమును మేల్కొలుపుచందమున మాకాగ్రహము కలిగించితి

వికదా? (ధర్మరాజుంజూచి) అన్నయ్యా! ధర్మతనూభవా!
నీమూాలమున నెన్ని యిక్కట్లుకలుగుచున్నవో చూచుచుంటివా?

సీ. నీమూాలమునఁగాదె ♦ నిండుకొల్వునసతి
కట్టుపుట్టములొల్వఁ ♦ గాంచినాము
నీమూాలమునఁగాదె ♦ నిజరాజ్యరమవీడి
వనములందువసింప ♦ వచ్చినాము
నీమూాలమునఁగాదె ♦ విన్న నేమ్మతివందు
కౌరవక్షితినాథుఁ ♦ గాచినాము
నీమూాలమునఁగాదె ♦ భీమూహావకీ్రిడ
కోహటింపక యిట్టు ♦ లుండినాము

తే. గీ. నేఁడు నీమూాలమునఁగాదె ♦ నెలఁతనట్లు
సైంధవుఁడు బట్టగాఁగ ల్గె ♦ సాహసమున
ధర్మమోాధర్మమోాయన్న ♦ గర్మమిట్లు
జరుగుచున్నది యేమందు ♦ శమనతనయ.

అర్జు—అన్నయ్యా! ప్రస్తుతమీావిషయవిచారణ మెందుకు? మనమా
సైంధవునిఁగూర్చి విచారింతము రమ్ము—

(పాండవులు నిష్క్రమింతురు.)

ధౌమ్య—(ఎదుటఁజూచి) ఇఁక భయము లేదు. పాండవులు సింధుపతి
సైన్యమును గలిసికొనినారు (పరికించి) అదుగో! అర్జునుఁడు
పన్నిద్దఱు సౌవీరకుమూారులను వధించినంతటనే సైంధవుఁడు
రథము దిగి పరుగెత్తుచున్నాఁడు. (పరికించి) అదిగో! పాంచా
ధర్మరాజకడకు వచ్చి నిలిచినది—(మరలఁజూచి) పాంచాలి
సహితుఁడై ధర్మరాజిట్లువచ్చుచున్నాఁడు.

(ధర్మరాజు ద్రౌపది-ప్రవేశము)

ద్రౌప—నాథా! ఆదురాత్మునిఁ జంపకుండఁ బాణములతోఁ గట్టి తెమ్మని వచించితిరేల?

ధర్మ-చ. సమరముసందుగాల్కొలఁదిఁ ♦ జక్కఁగఁబాఱెడు వానిపైఁబరా
క్రమమునుజూపఁగాఁదగున ♦ కామముచేనిటుచేసినట్టియా
విమతునిబట్టి యిట్యోడకు ♦ వేశ్యలరారఁగఁదెచ్చి జ్ఞాపకం
బమరెడుభంగి; నేదొవరి ♦ మానపుశిక్షవిధించుటొప్పుగున్.

ద్రౌప—ఈశాంతమే యింతవఱకుఁ దెచ్చినది. అజ్ఞాతవాసానంతరమునసైనను మీకు రణముతప్పదు. ఈసైంధవుని మీరిప్పుడు వధించితిరేని యెవ్వఁడు వీనినిగుఱించి ప్రయత్నముండదు.

ధర్మ—(ఎదుటఁజూచి) అదిగో! బంధితుఁడైన సైంధవునితోఁదమ్ములు వచ్చుచున్నారు.

(భీముఁడు సైంధవునిఁ దన్నుచు—అర్జునాదులతోఁ బ్రవేశించును)

భీమ—ఓరీ! దుర్మదాంధా! పాండవులయెదుటఁబడి నీవెటకేఁగఁగలవు?

(తన్నును)

తే. గీ. క్రూర! నీకామమునుదీర్చు ♦ కొనఁగసాధ్వి
ద్రుపదసుతయె కావలసెనా? ♦ తోఁచలేదె
పాపమనుమాట యొక్కింత ♦ పాపమొదవు
నీముఖంబునుజూచిన ♦ నీచహృదయ.

(మరల తన్నును)

సైంధ—(తనలో) అబ్బా! వీనితన్నులకు లోపలయెముకలు పొడియగుచున్నవి.

ధర్మ—తమ్ముఁడా! ఇఁక వీనింతన్నుట యాపుము. చచ్చిపోవునేమో!

అర్జు—(సైంధవునిఁజూచి)

తే. గీ. సింహమృగజాతియందు జ ♦ న్మించి చేయఁ
దలఁచి యీమాటమఱచి వి ♦ ధాతనిన్ను
మానవుని జేసెనంచును ♦ మదిఁదలంతు
గాక యున్న నీకీబుద్ధి ♦ కలుగు టెట్లు.

భీము—(ధర్మజునిదగ్గఱ కీడ్చుకొనిపోవును)

ధర్మ—ఓరీ! నరపశువా !

చ. పరసతులెల్లఁ దల్లులని ♦ భావమునందలపోతమాని యీ
వరమతివ్రతామణి న ♦ పారగుణాకర జేరి యిట్లు పో
దరియని ధైనసెంచక మ ♦ దంబునఁగోరుదువే దురాత్మ! నీ
చరితమునింద్యమైచనదె ♦ సజ్జను లెల్లరు దిట్టిపోయరే.

(అర్జునునిఁజూచి) అర్జునా ! వీనికేదుశిక్షవిధించెదవు ?

అర్జు—వీనికి దండన ధర్మశాస్త్రమే చేయవలయును.

ధర్మ—మరణదండనమునియే శాస్త్రమది చెప్పుచున్నది.

సైంధ—(తనలో) అక్కటా ! వీరునన్ను జంపివేయుదురు కాఁబోలు.
ఇట్టివనికి నేనేలపూనితిని. పరమేశ్వరా ! ఇట్టిపను లెప్పుడును
చేయను. రక్షింపుము.

అర్జు—చేఁజిక్కిన వీనినిజంపుట ధర్మము కాదు. శాశ్వతముగ జ్ఞాపక
ముండుశిక్ష యేదయినఁ జేయుట మంచిది.

సహ—అట్లయిన వీనితలగొఱిగి పంచశిఖలుంచి విడుచుట మంచిది.

ధర్మ—సహదేవునివాక్యములు బాగుగనున్నవి. (భీమునిఁజూచి)తమ్ము
డా ! ఈనరపశువునట్లుచేయుము?

భీము—(సైంధవునిఁబట్టుకొని యట్లుచేయును)

ధర్మ—ఓరీ! సైంధవా ! కౌరవభగిని యగు దుస్సలను, వృద్ధులగు
గాంధారీ ధృతరాష్ట్రులను జూచి నేఁడు నిన్ను విడిచితిమి. ఇఁక

నెన్నఁడును నిట్టియకార్యములు సేయక బుద్ధికలిగియుండుము పొమ్ము.

సైంధ—(తనలో) ప్రాణములతో విడిచిరి. అదియే చాలును. కాని తపమొనర్చి శివుని మెప్పించి రణమున వీరినోర్చెదఁగాక.

(నిష్క్రమించును)

ద్రౌప—సైంధవునకు మీరు చేసినశిక్షమాత్రమయిన కౌరవులకు తోలుతఁ జేసియుంటిరేని మనకీవనవాసక్లేశము లేకపోవుఁనిది కదా ?

భీము—నిశ్చయమే.

నకు—అట్లూరకొనుటచేత నేవారుమసలనశక్తులుగాఁదలఁచుచున్నారు.

భీము—అన్నయ్యా! ఇప్పుడయిన హాస్తినాపురమునకు నమరప్రయాణమాచరింపుము.

ధర్మ—తమ్ముఁడా ! సమయభంగమునకు నాచిత్తము సమ్మతింపదు. శుభోదయకాలమువఱకు ఓర్చియుండుట శ్రేయము, (ధౌమ్యునిజూచి) మహాత్మా ! మావనవాసమిఁక నెప్పటితోఁ బూర్తియగును?

ధౌమ్య—ఇఁకనొక మాసముమాత్రమే యున్నది.

ధర్మ—అట్లయిన నావిషయమునుగూర్చి యిప్పటినుండియుఁ బ్రయత్నింపవలయునుగదా ?

ఉ. ఎచ్చటికేగువారమిఁక ♦ నేగతిడాగెడువార మక్కటా
యిచ్చవలాత్మవెంటఁగొని ♦ యేపురికైనను జేరఁబాండవుల్
వచ్చిరటంచునచ్చటఁద ♦ లంచిరయేని, జనాళియొంతయుఁ
వచ్చునుగాదె యాశపథ ♦ భంగముఁ జేమియొనర్తుఁజెప్పుఁడీ.

( తెరలో )

ధర్మనందనా! అజ్ఞాతమునుగూర్చి మీరు శంకింపవలదు. విరటుపురము మీకు సర్వవిధంబుల వీలుగనుండును. ధర్మదేవతావరప్రభావమున మీరం దజ్ఞాతము గడపవచ్చును.

ధౌమ్యు—వింటివా! అంబరవాణిపలుకులు-ఇంకమీరు ప్రచ్ఛన్నవేషముల విరటుపురమున కరుగుప్రయత్నముననుండుఁడు.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.





# పాండవాజ్ఞాతవాసము.



## పంచమాంకము.



రంగము:—[విరటునినగరము—పాకశాలసమీపమున వలలుఁడను పేరునయున్న భీముఁడు ప్రవేశము]

భీము—(తనలో) ఆహా! కాలచక్రమెట్లుతిరుగునో చెప్పఁజాలముకదా? సమస్తసామంత నృపాలురును, చరణపంకేరుహములకు దాసులై సేవింప, సప్తద్వీపసముద్రముద్రితమహీవలయము నిరంకుశముగఁ బరిపాలింపఁజాలిన మాయగ్రజుఁడజ్ఞాతవాసదీక్షార్థము ప్రచ్ఛన్నవేషమునఁ గంకుఁడనుపేర బురాణములఁ జెప్పుచు మోదమునకై జూదమాడుచు నీకంకుని సేవించుచుండెనుకదా! ఈశ్వరుని ప్రసన్నునిగాఁ జేసికొని, పాశుపతాస్త్రముఁగాంచి పాకశాసనుని యర్ధాసనమునఁ గూర్చుండి, కాలకేయాదిదానవుల నిర్జించి, బృందారకులకానందముగొలిపిన పార్థుఁడు విబుధలోకవారవిలాసినీమణియగు నూర్వశియిచ్చిన శాపకారణమునఁ బేడితనముదాల్చి, బాహువులదీర్ఘత్వమునకు, గుణకిణంబులకుఁ గంచుకంబును, శంఖవలయంబులనుమాటువేసికొని రాజకన్యలకు నృత్యగీతంబులఁ జెప్పుచుండెనుకదా! నకులుఁడశ్వశిక్షకుఁడై దామగ్రంథియనుపేర నొప్పుచుం

డను. సహదేవుఁడు గోష్ఠములకధిష్ఠాతయై తంత్రీపాలుఁడయ్యె. హవ్యవేదియందు జన్మించి, ద్రుపదునకుఁ గూతురై మాకు పత్నియైన పాంచాలి సైరంధ్రీవేషమున మాలినియనుపేర విరటుపత్నిం గొలుచుచుండెను. ఇఁక నా విషయమును గూర్చి నేనేమని చింతింతును? బకాసురుని వధించి యేకచక్రపురవాసుల కానందము గలిగించితిని. జననమాదిగ బలపరాక్రమవంతుఁడనై విలసిల్లుచున్న నేను పౌరుషము విడిచి వంటలవాఁడనైతిని. (దైవము నుద్దేశించి) పరమేశ్వరా! నీగుణము లనంతములు.

మ. ధనికుం బేదగ, బేదను ధనికుఁగా ♦ ధర్మైకసంవేద్యు దు
ర్జనుగా, దుర్జను ధర్మతత్పరునిగా ♦ రాజిల్లఁ గాఁ జేయుచుం
ఘనుఁడా గారడివానిచందమున, లో ♦ కంబేలుచున్నావు నీ
మనమువ్వారుగనంగశక్తులు సుధ ♦ ర్మాంభోధిచంద్రోదయా.

(ఇంచుకయూరకుండి) మామాటకేమి కాని, మాతల్లినిదలంచుకొనినప్పుడెల్ల దుఃఖముకలుగకమానదు (తల్లినుద్దేశించి) హా! జననీ! కుంతీ!

సీ. కుంతిభోజునిముద్దు ♦ కొమరితై వాసిగా
నచ్చోటమిగులసౌ ♦ ఖ్యంబుగాంచి
పరమధర్మాత్ముఁడై ♦ పరిఢవిల్లినయట్టి
పాండుభూమీశ్వరు ♦ పాణిఁబట్టి
మహనీయమణిమయ ♦ మందిరంబులయందు
బరిచారికాతతి ♦ భక్తిమీర
ననిశంబుసేవింప ♦ నతులితభాగ్యభో
గములతో దీపించి తొల్లితలమున

తే. గీ. మహితవిక్రమధనులైన ♦ మాకుఁదల్లి
వై[illegible]యశముఁగాంచియు విధాత ♦ వ్రాతసకట

పరులయింటను కాలంబు ♦ జరుపుచుంటి
నకట ! యేమనిచింతింతు ♦ నమ్మమదిని.

(తెరలో)

అయ్యో! ఈదురాత్ముఁడు నన్ను వెన్నంటి తఱుముకొనివచ్చుచున్నాఁడు. ఈసమయమున వీనివారించువారు లేరా?

భీము—(ఇటునటుచూచితనలో) ఏమిది ! స్త్రీస్వరూపమువలె నున్నదే. (ఎదుటఁజూచి) ఓహో ! ఎవ్వరో కాంతయే యిట్లు పరువెత్తుకొని వచ్చుచున్నది.

(ద్రౌపది తొందరగా ప్రవేశించును.)

భీము—(తనలో) ఎవ్వరోయనుకొంటిని. పాంచాలియే. (ప్రకాశముగా) పాంచాలీ! పాంచాలీ!

ద్రౌప—(భీముని గాంచి) నాథా! రక్షింపుము. రక్షింపుము.

భీము—

తే. గీ. వాయుపుత్రుని మేనిలోఁ ♦ బ్రాణముండ
నొరులవలన నీకును భయం ♦ బొదవు టెట్లు
భయమువిడనాడి చెప్పుమా ♦ భాసురాంగి
హీనుఁ డెవ్వఁడు గలిగించె ♦ నిట్టిభయము.

భీమసేనదుర్వారక్రోధాగ్నికి శలభమగుట కెవ్వఁడు సాహసించెను ?

ద్రౌప—నాథా! మిమ్మిచ్చట చూచుటచేత కొంతఁ ధైర్యము కలిగినది. అయ్యో! నాభయకారణమేమని చెప్పుదును. ఇంకను నాదురాత్ముఁడు వచ్చుచుండెనేమో యని భయముగనే యున్నది.

భీము—ఆదురాత్ముఁ డెవ్వరు? నీకెగ్గుచేయఁదలఁచినవాఁ డెట్టివాఁడైనను నాచే శిక్షింపఁబడునని తలంపుము, రమణీ! వాఁ డెవ్వఁడు ?

ద్రౌప— నాథా! నాపరితాపము నీకుఁ గాక మఱియెవ్వరికిఁ జెప్పుకొందును. ఇంతపరాభవమందిన నేను మీయెదుట దానిం జెప్పుటకేల సంశయింపవలెను? నేఁటియుదయమున సుధేష్ణాదేవినిద్రించుచుండగా నామెం దర్శించుటకుఁ గీచకుఁ డరుదెంచినాఁడు.

భీము— సరే! అక్కగారియందు భక్తిఁ జూపుట మంచిదేకదా!

ద్రౌప— అక్కగారిని దర్శించి యరిగిన నాకీవిచారమేల?

భీము— అట్లుగాక, యాతఁడు నీయెడల దుర్నీతిం బ్రవర్తించెనా యేమి?

ద్రౌప— అతఁడరుదెంచిన సమయమున నేనచ్చటనుంటిని. వాఁడు నన్నుఁగాంచి మదనవికారచిత్తుఁడై యేమేమో పలికెను.

భీము— అవురా! దుర్మతుఁడట్టి దుర్యోగమునఁ బ్రవర్తింపఁ దలంచెను? రమణీ! నీవందులకేమి ప్రత్యుత్తరమిచ్చితివి?

ద్రౌప— నాకుఁ బలపరాక్రమశౌర్య విరాజితులగు పతులేవురున్నారు. వారలకు నేనీసంగతిఁ దెలిపితినేని, నిన్నొక్కత్రుటిలో యమాలయమునకుఁ బంపుదురు. తెలిసియో తెలియకయో యిట్లుకోరితివి. నీవును నాఁడుతోఁబుట్టువులతోఁ బుట్టితివి కదా యని పలికితిని. అతఁడు నామాటల చెవిసేర్పఁడయ్యె.

భీము— (కోపముతో)

మ. వనితా నీకును భర్తలేవురయి నిన్ ♦ బాలించుచున్నారటం
చును బల్కంగ వినంగనెంచఁడుకదా ♦ చోద్యంబు కానిమ్ము. దు
ర్జనుఁడింకేగతిమార్గముల్ వెదకునో ♦ జన్యంబునన్ నిల్చునో
ననురక్షింపుమటంచు వేడుకొనునో ♦ నారీ విచారించెదన్.

ఆదుష్టచరిత్రుఁడగు కీచకుఁడు నాచేఁ గూలినవాఁడని భావింపుము.

నేనిప్పుడేపోయి వానిం దుద ముట్టించి నీకు ముదము గూర్చెదఁగాక!

(పోఁబోవును.)

ద్వారి—నాథా! తొందరపడవలదు. నామారాలమున మీకు సమయ భంగమగును.

భీమ—తరుణీ! తొందరపడవలదనియా చెప్పుచుంటివి?

మ. అక్కటా! దుర్మదుఁడొక్కఁడీకరణిఁ గా ♦ మాయత్తచిత్తంబునన్
వికలప్రజ్ఞను మోహదృష్టులనినున్ ♦ వీక్షించి కోరంగఁ ద్రుం
చకనవ్వానిశిరంబు సైరఁగలఁడే ♦ శాతోదరీ! శాత్రవ
ప్రకరాభీలదవాగ్నికీలయగు నీ ♦ వాతాత్మజుండియ్యెడన్.

ఇంకను జెప్పవలసినదేమైననున్నదా? ఆసింహబలుఁడు నిన్నెచ్చటనుండి తరుముకొని వచ్చుచుండెను?

ద్వారి—వానిమందిరమునుండియే!

భీమ—వానిమందిరమునకు నీవేల యరిగితివి?

ద్వారి—సుదేష్ణయాజ్ఞననుసరించి.

భీమ—పరాంగనాసక్తచిత్తుఁడగువాని గృహమునకంపుటకు సుదేష్ణ నీవిషయమున నేలసాహసించెను?

ద్వారి—ఆమె తృష్ణతీర్చుకొనుటకై కీచకుని గృహమున నున్న మధురరసమును గొని తెమ్మని యామె నన్ను నియోగించెను. ఈ కార్యమునకై వేరొకరినిబంపుమని యామెను నేను బ్రతిమాలుకొంటిని. కాని యామె నాప్రార్థనమంగీకరింపలేదు. అందుపై భగవంతునిపై భారము వేసి నేను కీచకుని గృహమునకరిగితిని. నేను తన్మందిరప్రవేశ మొనర్చి ద్వారమున నిలుచుండి యాతనిం గాంచి "మీయక్కయగు సుధేష్ణాదేవి మిగుల దాహము గొని మీయింటనున్న మధురరసముగొని తెమ్మని నన్నుఁబంప

వచ్చితిని. సత్వరముగ నిచ్చి పంపు"మని పలికితిని. అద్దురా
త్ముఁడు నన్ను విలోకించి "సుందరీ! నీరాక నాకెంతయో మో
దము గలిగించినది. నాయక్కదాహము దీరుటకు వేరొకరిచే
మధురరసము పంపెదను. ముందు నాదాహము దీర్పుమని ప
లికి యెన్నియో నోటనుచ్చరింపరాని దుర్భాషలాడెను. అట్టి
సమయమున వానితోఁ బలుకనొల్లక వెంటనే మందిరము
విడిచివచ్చితిని. కాని దుష్టుఁడు నన్ను వెన్నాడుచుఁ గొంతదూ
రమువచ్చెను.

భీము — రమణీ! ఇఁకఁ జెప్పనక్కఱలేదు; నాకు వినుటకుఁ గష్టముగను
న్నది. అజ్ఞాతవాసదీక్ష మనకిఁక నొకమాసముమాత్రమే యు
న్నది. మనకు భయమావంతయులేదు. కావున నీవు మరల నీ
చకునిగాంచిన నప్పుడు భయమందక మోహమున్నదానివలె
నటించుచు రేపురాత్రి నర్తనశాలకు వచ్చినచో నభీష్టముదీర్చె
దనని చెప్పుము. నేనానర్తనశాలయందు వేచియుండి, వానిని
రహస్యముగఁ జిత్రవధగావించెదను. ఇంక నీవరుగుము. నేను
ను శయనస్థానమున కరిగెదను.

(ఇరువురును నిష్క్రమింతురు.)

(రంగము:— సుధేష్ణమందిరము:- ప్రవేశము ద్రౌపది.)

ద్రౌప — (తనలో) అక్కటా! నాకు జరిగిన పరాభవమునుగూర్చి సు
ధేష్ణకుఁ దెలుప, నామెతమ్మునిఁ గోపింతునని మాత్రము పలికి
యూరకుండెను. ఇఁక నేనీసంగతి నామెతో నేమియుఁ బలుక
క, కీచకుఁడియొద్ద కరుదెంచెనేని, నాథుఁడు చెప్పిన చొప్పున
ప్రవర్తించెదఁగాక !

(లోపల మాలినీ! మాలినీ)

ద్రౌప — సుధేష్ణాదేవి కాఁబోలు! పిలచుచున్నది. (నిష్క్రమించును.)

కీచకుఁడు—(ప్రవేశించి) అక్కటా! నేనెంతయుఁ దొందరపడితిని. మోహావేశమున మొదలు తెలియక, సైరంధ్రినిఁ బట్టఁబోవ నామె భయపడి మందిరమును విడిచిపోయెను. సామవాక్యములతోఁ భాషించియుంటినేని, నేను సఫలీకృతమనోరథసిద్ధుఁడనై యుండుటకు సందియము లేదు. (ఇంచుకయూరకుండి) ఆ నారీమణియందు జిత్తము మరలకయున్నది.

తే. గీ. ధరణిలోపలనున్నట్టి ♦ తలిరుఁబోండ్ల
నెల్ల దలకట్టుగాఁ జేయఁ ♦ దలఁచియజుఁడు
దానిఁబుట్టించెనంచును ♦ దలఁచువాఁడఁ
గాకయుండినవారీతిఁ ♦ గ్రాలఁగలదె.

అజగన్మోహనవిగ్రహము నాకన్నులఁ గట్టినట్లేయున్నది—

తే. గీ. కన్నులున్న ఫలంబును ♦ గాంచినాఁడ
నోరుమొవ్వంగ స్తుతిఁజేయ ♦ నోచినాఁడ
పులకలెత్తఁగ కౌఁగిట ♦ బొదవఁ గలుగు
భాగ్య మేనాటికోయింకఁ ♦ బడయువాఁడ.

అరవిందగంధీ! నీపైనున్న మోహము నన్నెంతహీనదశకుఁదెచ్చుచున్నది. నిద్రాహారములు మానిపించినది. నీవిప్పటికైనను నామొదలఁ గరుణవహింపుము. మదీయాంతఃపురాంగనలచే నీకూడిగము సేయించెదనని పలికియుంటిని. నాబలపరాక్రమశౌర్య ధైర్యసాహసములచేతనే విరటునిరాజ్యము వర్ధిల్లుచున్నదని చెప్పియుంటిని. నీవునాసంగతినొక్కింతయు విచారింపవైతివిక దా! (ఇంచుకయూరకుండి మరల మాయక్కగారి నీవిషయమై ప్రార్థించెదఁగాక! కాని నన్నామె చీవాట్లుపెట్టునేమోయని సంశయముగనున్నది. మధురరసమును నెపముగ నాయింటికిసైరంధ్రినిపంపినది. నేనే మందభాగ్యుఁడనై తొందరపడి కాలి

ముందుకువచ్చిన నిక్షేపమును వదలుకొంటిని. (ఎదుటఁజూచి) అదిగో! నాచిత్తమునుహరించిన కమలగంధి యిట్లేవచ్చుచున్నది. నేనెదురుగ నిలిచియుంటినేని భయమంది రావెఱచును గావున నీప్రక్కనుండెద.

(ద్రౌపదిప్రవేశించును)

ద్రౌప—(తనలో) నాకీసైరంధ్రివృత్తి యెప్పటికి తీరునో కదా! (ఎదుటఁజూచి) ఇదుగో దుర్మార్గుఁడగుకీచకుఁడిట్యేడ కరుదెంచినాఁడు (కొంచెము భయమునటించి వెనుక కేగును.)

కీచ—(ద్రౌపదినిఁజూ) తరుణీ! నన్నుఁజూచి భయమందెదవేల?

తే. గీ. మత్స్యరాజ్యలక్ష్మి యెవని ♦ మహితవిక్ర
మంబున విరాజిలుచునుండు ♦ నంబుజాక్షి
యట్టిసింహబలుఁడు దానుఁ ♦ దయ్యెనంచుఁ
దలఁపవేటికి నీవు చి ♦ త్తంబునందు.

రమణీలలామా! నిజముచెప్పిన నీవు నమ్మెదవో లేదో! పరమేశ్వరు నిసాక్షిగఁ బలుకుచున్నాను.

తే. గీ. ఎపుడు నాకోర్కెఁదీర్తువో ♦ నీవటంచు
వేచియుంటిని, నిజముగా ♦ విద్రుమోష్ఠి
స్వాతివానకున్న కడు ♦ వాంఛతోడ
గాచియుండెడు నాచాత ♦ కంబుకరణి.

ఇంక నన్నుఁగష్టపెట్టక నాయభీష్టముఁ దీర్పుము—

వసంతకోకిల.

సరోజపత్రనేత్రి యింక ♦ జాలమేలనే
స్మరుండు కోపమూని బాణ ♦ జాలమేసెడిన్
బిరాననాదుకోర్కెఁదీర్చి ♦ ప్రేమఁజూడవే
స్మరుండు గర్వమెల్లవీడి ♦ శాంతమూనఁగన్.

(సమీక్షించుచున్నాఁడు)

ద్రౌప—(తనలో) ఇంక వీనిని సామవాక్యములచే వంచించి మృత్యు దేవత సన్నిధికిఁ బంపవలయును (ప్రకాశముగా) రాజా! నీవు తొందరపడవలదు. నిన్నింతవఱకు శ్రమపెట్టినందుకు క్షమిం పవలయును. నీకు నాయందెట్టిమోహమున్నదో యరయుట కిట్లు కాలహరణమొనరించితి గాని మఱియొకటి కాదు. కాని నేఁజెప్పినట్లు చేసితివేని నీయభీష్టముతీరఁగలదు.

కీచ—(సంతోషముతో) తరుణీ! నీయాజ్ఞకు బద్ధుఁడనుకదా!

ద్రౌప—నేఁటిరాత్రి యెవ్వరును జూడకుండ నీవొంటరిగా నర్తనశాల కరుదెమ్ము, రెండవవానికిఁ దెలిసినచో నాకు హానిసంభవించు ను. నేనచ్చట నీరాకకై నిరీక్షించుచుండెద. ఇఁక మాటలుపలు కక పొమ్ము. మనసంభాషణ యెవ్వరైననువిందురు.

కీచ—సంతోషము—(ఇంచుక యూరకుండి) అక్కగారి నొకసారి దర్శించిపోయెద—(నిష్క్రమించును.)

ద్రౌప—(నిష్క్రమించును.)

రంగము:—(నర్తనశాల—వస్త్రము శరీరమునిండఁగప్పుకొని
భీముఁడు శయనించియుండును)

భీము—(తనలో) పాంచాలివాక్యములననుసరించి కీచకుఁడిప్పు డిచ్చో టికరుదెంచెను. నేను జాగరూకతతోనుండి యద్దురాత్ముఁడు వచ్చినంతనే వానిని యమాలయమునకుఁ బంపవలయును.(ఇం చుక యూరకుండి) ఎవరో వచ్చుచున్నట్లు తోఁచుచున్నది.

కీచ—(ప్రవేశించి) సైరంధ్రియరుదెంచి నాకైవేచియుండును. ఆహా! నేఁటికికదా నేను కృతార్థుఁడనైనాను. అక్కాంత యేమూలను న్నదో యరసెదఁగాక ! (ఇంచుక ముందునకు నడిచి) ఇదిగో!

నాయన్నులయిన్న. (సమీపించి) తరుణీ ! ఎవ్వరైనఁ జూచెదరే మోయను భయముచేతనా మూలదాగితివి? ఈయర్ధరాత్రిసమయమున నీనర్తనశాల కరుదెంచువారెవ్వరు? నీకు భయము వలదు. ముసుఁగు వెదలింపుము.

భీము—ఉహ్—

కీచ—నారీమణీ ! నిద్రవట్టినదా యేమి ? లెమ్ము. లెమ్ము?

భీము—(మాటలాడకుండును)

కీచ—(ముసుఁగుదీయుచు) చిలుకలకొలికీ! నేను వచ్చుట యాలస్యమైనదని యలుకవహించితివా యేమి ?

భీము—(ముసుఁగుదీయుచు) నేను చిలుకలకొలికినిగాను. నీప్రాణములుకొలుకుటకిచ్చట వేచియున్నాను. (చేతులతోఁగీచకుని నదిమిపట్టి)

చ. పరమపతివ్రతామణిని ♦ భవ్యచరిత్రను మాలినిన్ నిరాదరణముతోడఁజూచి దురి ♦ తాత్ముఁడవై రమియింపఁగోరి యారాకరణిని వచ్చినట్టి నిను ♦ గాలుని ప్రోలికిఁ బంపువాఁడ, నీమరణముజూచి భీతిపడి ♦ తన్మాధవులీగతి సేయకుండఁగన్.

ఓరీ ! కులపాంసనా! నాకు బలవిక్రమసంపన్నులగు నేవురు భర్తలున్నారని యీసైరంధ్రిచెప్పినను, నీచిత్తము నాదురుద్యోగమునుండి మఱలింపవైతివికదా? ఇప్పుడు నీకెవ్వరు దిక్కగుదురో చూచెదఁగాక? నీబలపరాక్రమము లెట్టివో చూపుము?

కీచ—ఆ ! ఎవ్వఁడవురా నీవు ? (పెనగుచున్నాఁడు)

భీము—నాచేఁజిక్కిన నీవు తప్పించుకొనుటకుఁ జూచుచుంటివా ?

(ఇరువురును ముష్టియుద్ధముసేయుచున్నారు)

భీము—దురాత్మా ! ఈముష్టిఘాతము నిన్ను గాలుని ప్రోలికంపుఁగాక-(గుద్దుచున్నాఁడు)

కీచ—హా! (నేలఁగూలును)

భీము—(తనలో) వీఁడు మడిసినాఁడు. ఇఁక నేనిక్కడ నుండరాదు పాకశాలకుఁ జేరుకొందును.

(నిష్క్రమించును)

రంగము:—[విరటపుర ప్రాంతభూమి:—ప్రవేశము:—ధర్మరాజు కంకుభట్టు]

ధర్మ—(తనలో) ఎట్లయిన మాయజ్ఞాతమునకు భంగము చేయఁదలఁచి యాసుయోధనుఁడు విరటుని గోబృందమును బట్టుకొనుటకు సుశర్మం బంపినాఁడు. అతఁడియాజ్ఞ ననుసరించి కదా సుశర్మ గర్వమేర్చి గోపాలకుల మోది గోగణమును బట్టుకొనినాఁడు. (తెరలో ధ్వనివిని) అదిగో! సుశర్మ గోవులను విడిపించుకొనుటకేగిన విరటునిదాఁకి సైన్యములఁ గలఁచుచున్నాఁడు (పరికించి) అబ్బా! విరటునకును, సుశర్మకును పోరతిఘోరముగ జరుగుచున్నది. సుశర్మసైన్యమున సంతోషధ్వనులు హెచ్చగుచున్నవి; కారణమేమో! (పరికించి ఇంచుక ముందునకునడిచి) ఆహా! ఇదియేమి? సుశర్మ పరాక్రమమున విజృంభించి విరటుని రథునిగాఁ జేసి, ముష్టియుద్ధమున నోడించి, యతనిం బట్టుకొని, తనరథముపైఁ బెట్టుకొని యరుగుచున్నాఁడు. అతఁడిట్టి సాహసకృత్యమును సేయుచుండ నాతమ్ముఁడూరకొననేమి? (ఎదుటఁజూచి) ఓవలలా! దామగ్రంథీ! తంత్రిపాలా!

ఉ. చూచెదరేమి? మీ రటులు ♦ చోద్యముగా విరటుం సుశర్మ సం
కోచములేక బద్ధునిగ ♦ గొంచును బోవుచునుండ నవ్వరే
యాచరితంబు విన్న ధర ♦ నీశుఁడు లెండిక, దర్పమేర్చి యా
నీచునిదాఁకి మత్స్యపుర ♦ నేతను రక్షణసేయుటొప్పగుఁ.

మీ పౌరుషపరాక్రమములు ప్రకటించి రాజభక్తులుగండు. మిమ్ము బాలించు భూపతి యరులచేఁజిక్కుటఁజూచి మీరూరకొనుట పాడి కాదు. లెండు; జాగు సేయకుఁడు.

తే. గీ. గర్వమును జేర్చి యారీతిఁ ♦ గారవేంద్రు
నాజ్ఞ గోగణంబును బట్టి ♦ యరుగు వాని
శర్మ దర్పంబు దూలించి ♦ సాహసమునఁ
దెండు వాని నిటకు వేగ ♦ ధీరులార.

(ఇంచుకయూరకుండి) అదిగో. నావాక్యము నాలించి భీమనకులసహదేవులు మూర్తీభవించిన శౌర్యదేవతలోయనునటు విరటునిబంధించుకొని పోవుచున్న సుశర్మరథమున కడ్డుపడి యాతని నిలువరించినారు. ఆహా! నకులసహదేవులు వెనుకభాగమునుండి, తమ్ముఁదాటుటకువచ్చిన సుశర్మ సైన్యములపైఁబడి హరిణపంక్తిపైఁబడు సింహకిశోరములచందమున వీరవిక్రమవిహారమునలుపగడంగిరి. (సంతోషముతో) భళీ! భీముఁడు చెలరేగిన మత్తగజము చాడ్పున సుశర్మరథముమీఁదకు లంఘించి, యాతని నొడిసిపట్టి, రథమునకుపిలుచికట్టి, విరటుని విడిపించి యిట్లువచ్చుచున్నాఁడు. నేఁడు వాయునందనుని మూలమున విరటుఁడు రక్షింపఁబడినాఁడు.

(బంధింపఁబడిన విరటునితో భీమ నకులసహదేవులును విరటుఁడును ప్రవేశించుచున్నారు)

ధర్మ—(విరటునిఁజూచి) భూరమణా! వచ్చితివా?

విర—(ఇంచుక సిగ్గు నభినయించుచు)

భీమ—(ధర్మరాజును జూచి) ఆర్యా! కంకభట్టారకా!

చ. కురుపతిపంపఁగా నటు ల ♦ కుంఠితశౌర్యముతోడవచ్చి యీ
విరటనృపాలు గోగణము ♦ వేడ్కనుబట్టిన యుద్ధురాత్మునిన్

దురమునఁ దాఁకి దర్పమును ♦ మాల్చి నృపుండుముదంబునంద, నీ
కరణిని బట్టితెచ్చితిని ♦ కాగల శిక్షవిధింపఁగాఁదగున్.

ధర్మ—(సుశర్మనుజూచి) ఓయీ! సుశర్మా! నీవు దుర్యోధనుని పంపున విరటుని గోగణంబును నెందులకు బంధించితివో మాకుఁ దెలియును. కాని యీవిషయమును గూర్చి మేమిప్పుడు చర్చించుట కవసరములేదు. ఎవ్వరు త్రవ్వుకొన్న గోతిలో వారేపడుదురు. శత్రుపక్షములోని వాఁడవగు నీవు మాచేఁజిక్కితివి. ఇప్పుడు నిన్ను మేమేమిచేసినను మమ్ము వారించువారు లేరు. కాని, మాచిత్తమందులకు సమ్మతింపదు. నీవు మాభూపతిమొదలఁ జేసిన దుష్కృత్యమునకు నీశిరము ఖండించినను మాకుఁ బాపముకలుగదు. కాని, నిన్ను విడిచిపుచ్చుచుంటిమి. బుద్ధికలిగివర్తింపుము.

సుశ—(తనలో) అక్కటా! నాకెంత పరాభవముకలిగినది! దుర్యోధనుని మొగమెట్లు చూడఁగలను! (నిష్క్రమించును)

విర—(ధర్మరాజునుజూచి) మహాత్మా! నేఁడు నీవాక్యములననుసరించి యీవలలుఁడు నన్నురక్షించినాఁడు. ఈతఁడు లేకయున్నచో నేనీదినమున శత్రువులకుఁ జిక్కియే యుందును.

ఉ॥ వంటలవాఁడయైన నిటు ♦ వంటి పరాక్రమశౌర్యశాలినిన్
గంటిమె యెచ్చటైనను జ ♦ గంబున మున్ను సుశర్మ నేఁడు తా
మంట తెలుంగునన్ బడి యు ♦ మానుషకృత్యము సల్ప వానినిన్
గొంటి మదీయజీవముల ♦ నిక్కముగా నిలిపెన్ గురూత్తమా!

తంత్రిపాల దామగ్రంథుల శౌర్య మనివార్యమై యున్నది. ఏదియెట్లున్నను, నీమూలమున నేను రక్షింపఁబడితిని.

తే. గీ. ప్రాణరక్షకుండవగుదుఁ ♦ బటుగునీకు
మత్స్యదేశంబు నిపుడు స ♦ మర్పణంబు

జేసి, నిన్ను సేవించెద ♦ వాసిమీఱ
సమ్మతింపుము దీనికి ♦ సచ్చరిత్ర!

ధర్మ—రాజేంద్రా! నాయందున్న గౌరవముచే నట్లు పలికెదవుగాని నేను నీవిషయమునఁ జేసిన మహాకార్యమేమున్నది? నేనట్టి యాధిపత్యమున కర్హుఁడనుగాను. ఈవలలాదులు నీయెడలఁ జేయవలసిన విధాయకకృత్యమును సలిపినారు.

విర—(భీముని జూచి) వలలా! మున్ను నాయాస్థానమునకు దుర్యోధనుని పంపున నరుదెంచిన మల్లురనోడించి నాకు యశము గూర్చితివి. నేఁడు సుశర్మ నన్ను రణమున నోడించి, బంధించుకొని పోవుచుండ వానిగర్వమార్చి నాప్రాణములఁ గాపాడితివి. ఎన్ని జన్మములకైన నీయుపకారము నేను మఱువఁజాలను.

భీము—రాజేంద్రా! నేను నీకరుణకుఁ బాత్రుఁడనే గాని శ్లాఘ్యమునకుఁ గాదు.

ధర్మ—రాజా! ఇఁక నీవు రణవిజయమంగళతూర్యనాదములు సెలంగ సేనాసమన్వితముగఁ బురింబ్రవేశింపఁదగును.

విర—మంచిది.

(అందఱు నిష్క్రమింతురు.)

రంగము:—[నర్తనశాల-ప్రవేశము-బృహన్నలవేషముననున్న]
(అర్జునుఁడు-ద్రౌపది-ప్రవేశించుచున్నారు.)

అర్జు—తరుణీ! నీవీసమయమున నియ్యెడకేల యరుదెంచితివి?

ద్రౌప—భీష్మద్రోణకృపాశ్వత్థామాధిష్ఠితమగు కౌరవసైన్యమరుదెంచి యీపురప్రాంతారణ్యముననున్న విరటుని గోవర్గమును బట్టెనఁట! గోపాలు రదిగాంచి కౌరవబలముగా నెఱింగి పరుగు పరుగున వచ్చి యంతఃపురమున నున్న యుత్తరునితోఁ జెప్పిరి.

అంతట బాలుఁడు కురుబలమును దాటుట కేగుటకు సంశయించి తగిన సారథి లేఁడని విచారించుచుండెను.

అర్జు—ఇంతకుమున్నె విరటుఁడు సుశర్మపైకరిగి విజయలక్ష్మీలోలుఁడై యరుదెంచుచున్నాఁడని వింటిని. అతఁడింకనుఁ బురిఁజేరలేదు. మనకిఁక నజ్ఞాతవాసదీక్ష యొకదినము మాత్రమేయున్నది. కావున నీవిప్పుడుత్తరునికడ కరిగి కౌరవులపై నెత్తిపోవుటకుఁ బ్రేరేపించి, సారథిగా నన్నుఁ గొనిపొమ్మని చెప్పుము? శీఘ్రముగఁ బొమ్ము. (నిష్క్రమించును.)

ద్రౌప—(ఈవలకువచ్చి తనలో) అర్జునుఁడు రథసారథియై యుత్తరునితో నరిగినేని కురుబలముల నురుమాడఁగలఁడు. అజ్ఞాతవాసదీక్ష యిఁక నొకదినముమాత్రమే యుండుటంజేసి మేముబయల్పడినను సమయభంగము కాదు. (ఇంచుక నడిచి) అదిగో! ఉత్తరుఁడే యిట్లు తొందరగా వచ్చుచున్నాఁడు.

ఉత్త—(ప్రవేశించి) అప్పురా! దురాత్ములైనకౌరవు లెంతపనిజేసిరి! ఒక ప్రక్కనున్న గోగణమును బట్టుటకు సుశర్మంబంపి, మఱియొక ప్రక్కనున్న గోవులను వారు బాదివిరిగా! కానిమ్ము, వారికిఁ దగిన ప్రాయశ్చిత్తముఁ జేసెదఁగాక!

ద్రౌప—(ఉత్తరుని సమీపించి) మహీరమణాత్మజా! ఏదియో దీర్ఘాలోచనము సేయుచు తొందరగాఁ బోవుచుంటివే?

ఉత్త—సైరంధ్రీ! ఏమని చెప్పుదును!

చ. కురుబలమేగుదెంచి మన ♦ గోవులఁబట్టి నటంచువింటి నే
బారిఁగొన శత్రువర్గమును ♦ బోవలెనందుకు స్యందనంబునుం
బరువడిదోలుసారథి క ♦ నంబడకుండుటఁ జేసి దానికిం
జెరువును జూచుచుంటి నిఁకఁ ♦ దెల్పెడిదేమి వినంగమానినీ.

ద్రౌప—రాకుమారా! ఇదియా యాలోచన. దీనికై యింత యోచింపనేల? మనబృహన్నల సారథ్యంబునఁ బ్రవీణుఁడు.

ఉత్త—(నవ్వును.)

ద్రౌప—బృహన్నలపేరు చెప్పినంతనే నవ్వితివేమి?

ఉత్త—ఏమున్నది. బృహన్నలసారథ్యమున గట్టివాఁడని చెప్పినందులకు నవ్వువచ్చుచున్నది. ఇప్పుడు మనగోగణమును బట్టినవారు భుజబల శౌర్యసముద్రులగు ధార్తరాష్ట్రులు. వారినెదుర్కొన దలఁచినది నృపలోకోత్తరుఁడగు నుత్తరుఁడు. అట్టియెడల బృహన్నలసారథ్యముఁ జూచి శత్రువులు పరిహసింపరా? అదియుంగాక పేడివానిని జూడనని నాకు వ్రతము.

ద్రౌప—విరటరాజనందనా! నీవట్లు సందియమందవలదు; కొన్ని కారణములచే నాతని శరీరమున కట్టి వికారము వచ్చినది. బృహన్నల నీకు సారథియై యుండునేని కౌరవులనే కాదు. మూడులోకములేకమై నీపైకెత్తివచ్చినను నీవు జయింపఁగలవు. నామాట విని యాతని సారథిగాఁ జేసికొని పోయి గోవులను మరలించుకొనిరమ్ము. ఆబృహన్నల పాండవులయొద్దనుండఁగా నతని రథచోదకనైపుణ్యమును, పరాక్రమమును నేను చూచియుంటిని.

ఉత్త—అతనింగూర్చి నీవంతగాఁ బలుకుచుంటివి గాన నొకసారి నాకడకుఁ గొనిరమ్ము?

(చెరియొక దోవను నిష్క్రమింతురు.)

రంగము:—విరటుని నగరసమీపమున బయలు:

[ప్రవేశము—ఉత్తరుఁడు-బృహన్నల యను పేరనున్న యర్జునుఁడు.]

ఉత్త—

చ. అరదముఁబోవనిమ్ము సమ ♦ రావనియందు గురుక్షితీంద్రు భీ
కరశరవార్థిముంచి, యల ♦ కర్ణునిగూల్చి; ఘటోద్భవాదులన్
దురముతొలంగిపోవునటు ♦ దోర్బలశౌర్యము జూపి గోవులన్
ద్వరితగతిన్ మరల్చెదను ♦ దండ్రికి మోదముగల్గునట్లుగన్.

అర్జు—(తనలో) అజ్ఞాతవాసదీక్ష నిన్నటితోఁ బూర్తియైనది. ఇంకఁ గౌరవులు గుర్తించినను భయములేదు. నాపరాక్రమముఁ జూపుటకుఁ దగినసమయము వచ్చినది. (ప్రకాశముగా) ఇదిగో! రథము బోనిచ్చుచున్నాను.

ఉత్త—బృహన్నలా!

ఉ. కౌరవసైన్యమండలిసి ♦ గాంచి మదిన్ గడుభీతిబొందుచున్
బారెద వేమొను మ్మరుల ♦ భంజన జేసెడివేళయందునన్
ధీరతతో మెలంగవలె ♦ దివ్యయశోరమ నాదుతండ్రినిన్
జేరెడుభంగిఁ జూడవలెఁ ♦ జెప్పితినంచుఁ దలంపఁబోకుమా.

అర్జు—ఉత్తరా! ఎంతవెఱ్ఱివాఁడవు!

ఉ. కౌరవసేనకాదు త్రిజ ♦ గంబులునొక్కట నెత్తి వచ్చినన్
ధీరతయింతయేనియు మ ♦ దింబెడబాయదు నీవుచూడుమా
తేరును నెట్లుదోలెదనొ ♦ తేకువతోడను సంగరంబునన్
వైరులఁగూల్పుమయ్య నర ♦ పాలుఁడు నీజనకుండు మెచ్చఁగన్.

(రథమునింకను నడపి) రాజకుమారా!

మ. అదిగో! కౌరవసేనఁజూచితివె యా ♦ ద్యద్భూరిదర్పంబుతో
నెదురుంజూచుచునున్న దయ్యదునకై ♦ యావచ్చటం జేరి దు

ర్మదులఁ బీచమడంచి బాహుబలశౌ ♦ ర్యస్ఫూర్తి రాజిల్ల సొం
పొదవన్ గోవుల త్రోవగావలెను మ ♦ త్స్యోర్వీశ సత్పుత్రకా!

ఉత్త—(పరికించి భయముతో.)

మ. ఇది యాకౌరవరాజసేనయనఁగా ♦ నేఁ జేరఁగాశక్యమే
మదిలోనం దడపుట్టి దీనిఁగన దు ♦ స్సాదంక నెల్లాను బ
ల్లిదులన్ గంటిమి యొండయుండిరి యటన్ ♦ లెక్కించఁగా రాకఁ
గదియంబోక మరల్పుమా రథము నే ♦ గన్ జేరగానింటికిన్.

అర్జు—మత్స్యరాజనందనా! నాతోఁ బరిహాసమున కిట్లు పలుకుచుంటి
వా యేమి?

ఉత్త—పరిహాసమేమి! కౌరవసేనం జూడగనే ప్రాణము లెరిగిపోవు
చున్నవి.

అర్జు—తనలో) ఉతఁడు నిజముగా భయమందినాఁడు. భయమును
బాపవలయును. (ప్రకాశముగా) ఉత్తరా!

చ. కురుపతిభీష్ముఁడున్ మతియుఁ ♦ గుంభభవుండునుగర్ణుఁడున్ విభీ
కరసమరంబులోన నను ♦ గవ్వడిగాఁ దలపోయనట్లుగా
శరములఁ జిమ్ముచూపెదను ♦ శౌర్యమటంచును బల్కలేదె మీా
ధరణిపుతోడ; నిప్పుడిట ♦ ధైర్యమువీడిన నవ్వరేజనుల్.

ఉత్త—నవ్వినసవ్వనిమ్ము. కురుసైన్యమును మాత్రము నేను దాకఁజా
లను. ప్రాణములుండినఁ జాలును.

అర్జు—రణమునకు భీతిల్లుట వీరక్షత్రియగుణము కాదు,

ఉత్త—బృహన్నలా! యుద్ధమనగా నృత్యము కాదు. ఒక్కొక్కసమ
యమున రణమునకు మేమే వెనుదీయుచుందుము, అట్టిచో నీ
వింతనిర్భయముగాఁ బలికెద వేల?

అర్జు—యుద్ధకుసగా నాకుభయము లేదు. నేను నీకు రక్షకుండను. భయమందక కురుసేనం దాకుము.

ఉత్త—అమ్మయ్యో! నీధైర్యమును జూచుకొనియా నేను యుద్ధము సేయుట! చాలు చాలు! ముందుసారథిని జంపియే రధికుని జంపుదురు.

అర్జు—నాప్రాణముల నేను రక్షించుకొనుచు నీప్రాణములకూడ రక్షించెదను. కురుసేన యేగాక దేవాసురులకు దెంచినను నేను భయమందను. త్వరగా రథమెక్కుము. శత్రువుల దాకుదము. (రథము పోనిచ్చును.)

ఉత్త—(తనలో) పేడియగు నీతనివలుకు లద్భుతముగనున్నవి. నామాటవినక రథము పోనిచ్చుచున్నాఁడు. (ఎదుటజూచి) అదిగో! కురుసైన్యమును సమీపించుచున్నాము. (ప్రకాశముగా) బృహన్నలా! నాయొడలు కంపమెత్తుచున్నది. నన్ను బ్రదుకనిమ్ము. రథమును గృహమునకు మరల్పుము.

అర్జు—భయమందవలదు.

ఉత్త—నీవు రథము మరల్చెదవా లేదా?

అర్జు—రాజకుమారా! నీకింతభయముగానున్న సారథివగుము. నేను రథినయ్యెదను.

ఉత్త—చాలు చాలు. నీవేడ, సమరముచేయుటేడ! (తనలో) ఈతఁడు నేనెంత చెప్పినను వినకయున్నాఁడు. ఇంక నేనురథముదిగి పాఱి పోయెదను. (రథముదిగి పాఱిపోవును)

అర్జు—(తనలో) ఇప్పుడు నేనేమి సేయుదును (ఆలోచించి) కానిమ్ము; మాయజ్ఞాతదీక్ష నిన్నటితోఁ బూర్తియైనది. మేము విరటుని నగరమును బ్రవేశింపఁబోవు సమయమున శమీవృక్షముపై దాచియుంచిన మాయాయుధములందు నాగాండీవమును గైకొని యు

త్తరునకుఁ దన సంగతి బయలుపెట్టి యాతనిని సారథిగాఁ జేసి
కొని నేను కురుసేనం దాకెద (ప్రకాశముగా నెదుటఁజూచుచు)
ఉత్తరా! నిలువుము నిలువుము. (నిష్క్రమించును)

దుర్యోధన కర్ణ భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు ప్రవేశింతురు)

దుర్యో—యోధులారా! ఈవింత చూచితిరి కదా? ఆతఁడెవరో మన
పైకి వచ్చుచు రథముదిగి పాఱిపోయెను.

ద్రోణు—ఆపాఱిపోయిన వాఁడెవ్వఁడో మనమూహింపఁజాలము. దా
నికి చిత్రమగు కారణమేదో యొకటియుండును. అయినను నీవి
షయమున సంశయమందనేల:

ఉ. సందియమందనేల? యిటు ♦ శౌర్యమునన్ గురుసేనపైకి రా
డెందమునందు నెవ్వఁడు క ♦ డిందిదలంచును? వేయునేల సం
క్రందనసందనుండతఁడు ♦ కావలె నేరిని జూడఁగోరి గో
బృందముబట్టినారమిపుడు ♦ వీరులవారలఁ జూడనయ్యెడున్.

దుర్యో—ఆచార్యా! ఆవచ్చినది యర్జునుండనియా మీయూహ.

ఉ. ఇంచుకయైనబోదలఁప ♦ కీయతఁడేయురుదెంచెనేని మా
కంచితసంతసంబెయగు ♦ నయ్య దురోదరమందువారుగా
వించిన మాప్రతిజ్ఞ నెఱ ♦ వేఱగలేదనిపల్కి యొట్లు పం
పించెద వారలన్ విపిన ♦ వీథులలోఁ జరియింపఁ గ్రమ్మఱన్.

భీష్మ—(తనలో) వీనికింకను దుర్బుద్ధిపోలేదు. (ప్రకాశముగా) దు
దుర్యోధనా! ఎంతవెఱ్ఱివాఁడవు.

ద్రోణు—

తే. గీ. అర్ధరాజ్యంబు నిమ్మంచు ♦ నడుగవచ్చి
నప్పుడట్లన నగుగాని ♦ యాలకొఱకు
విరటు సేవకుఁడగుచును ♦ నరుగుదెంచుఁ
గాదె! దానికేమందుము ♦ కౌరవేంద్ర.

ఆదియుంగాక పదిమూడు సంవత్సరములనుండియు నాతని చిత్తమున
నడంగియున్న పరాక్రమము నేఁడు వెల్లడించితీరును. అతని నెదిరించుట
కిప్పుడు మీరు సంసిద్ధులైయుండుఁడు.

కర్ణ—ఆచార్యా! రారాజునకుఁ బిటికిమందుపోయుచుంటివేమి? ఆవ
చ్చువాఁడర్జునుఁడని నీవు నిశ్చయముగాఁ జెప్పఁగలవా?

శా. ఏమీ! పార్థుఁడె వచ్చుగా యిపుడు రా ♦ నీ శంకయేలా యిఁకన్
భూమీశాగ్రణి యీసుయోధనుఁడు పే ♦ ర్మోదింపఁగా నేఁడు సం
గ్రామక్షోణిని యాధనంజయుని దో ♦ ర్గర్వంబు దూలింతు నీ
సామీప్యంబున జూచుచూ యిఁకనుమ ♦ చ్ఛౌర్యప్రతాపోన్నతిన్.

అశ్వ—అంగరాజా! ఎన్నియైనను చెప్పవచ్చును. కాని, చేయుట మా
త్రము కష్టము.

కర్ణ—అది నీవంటివానికి. (దుర్యోధనునిఁజూచి) రాజేంద్రా! అర్జున
పక్షపాతులైనయీద్రోణాశ్వత్థామలు యుద్ధము సేయనవసరము
లేదు. నేనొక్కఁడ యర్జునుని దెగటార్చెద.

(తెరలో ధ్వని)

ద్రోణు—యోధులారా! దేవదత్తధ్వని వింటిరా! ఇప్పుడైనను నర్జు
నుండని తెలిసెనా?

కర్ణ—

ఉ. అర్జునుఁడైననేమతని ♦ యబ్బసురేశ్వరుఁడైననేమి వి
స్ఫూర్జితశక్తితో సమర ♦ భూమినెదిర్చి శరాళిగప్పియ
య్యర్జును నేలగూల్చి విబు ♦ ధాలయమునుంగనఁబంపి నేఁడు నే
నార్జనసేతు సద్యశము ♦ నందఱుఁజూడఁగ రాజుమెచ్చఁగన్.

అశ్వ—కర్ణా! ఏల యీలీల ప్రగల్భవాక్యములాడెదవు?

తే. గీ. అలద్రుపదనందనీపరిణ ♦ యంబునాఁడు
చిత్రరథునిచేరాజు ♦ చిక్కునాఁడు

గాంచియుండమె నీవు వి ♦ క్రమముసొంపు
నేఁడు క్రొత్తగవచ్చెనా ♦ నీకుబలము.

కర్ణు—బ్రాహ్మణులగుమిమ్ము వెంటఁబెట్టుకొనివచ్చుట కారణేమన్ని తప్పు.

అశ్వ—అట్లనా! ఇప్పుడు మనపై కెత్తివచ్చుచున్న చిరకాలకానన వాసజాతరోషోగ్రుండగు నాయర్జునుని దాకి రారాజునకుముద ముగలుగఁజేయును.

కర్ణు—అందులకు సందియమేమున్నది?

ఉ. నరుఁడిటువచ్చుగాకను మ ♦ నంబున భీతినిబొందనేల సం
గరమునవాఁడె కాదు త్రిజ ♦ గంబులు నొక్కటనెత్తివచ్చినన్.
గురుబలశౌర్యమేర్పడఁగఁ ♦ గూల్చెద భూపతిసంతసింపఁగాఁ
బిఱికితనంపుమాటలవి ♦ వేకుల భంగిని నాడనేటికిన్.

అశ్వ—రాధేయా! నీ శౌర్య మిందెవ్వరెఱుంగరు?

కర్ణు—ద్రోణాయనీ! యుద్ధము జేసిన నేనే చేయవలయును. మీరేమి చేయఁగలుగుదురు. (దుర్యోధనునిఁజూచి) రారాజా! సంతర్పణ మనినంతనె యెంతదూరమైనఁ బరుగెత్తువారును, ఎవరైననొక రూకనిచ్చెదమన్న బొంగుచు నేగువారును, తిరిపెమెత్తికొనుచు జీవయాత్ర గడపువారును, ధనాశచే దుర్దానములఁగొను వారు నునగు నీబ్రాహ్మణు లేమియుద్ధము సేయుదురు?

అశ్వ—సూతకులసంభవుఁడవగు నీవు బ్రాహ్మణుల నిందించు చుంటివిగా రథచోదకవృత్తి నుండవలసిన నీకు రాజ్యాధిపత్యము లభించుటంజేసి కన్నుగానక యుంటివి.

కర్ణు—సుయోధనా! యుద్ధమున కిట్టివారిని దోడ్కొనివచ్చుట హాని కరము. వీరు తిన్నయింటివాసముల నెన్నుచుందురు.

అశ్వ—(కృపాచార్యునిఁజూచి) మామా ! రారాజు భుక్తశేషమును భుజించి బలుసిక్కిన వీనినోటి కడ్డులేక యున్నది. తగినప్రాయశ్చిత్తము సేసినఁగాని బుద్ధిరాదు.

ద్రోణు—కుమారా! తొందరవలదు.

కర్ణు—(అశ్వత్థామనుజూచి) నాకుఁ బ్రాయశ్చిత్తమును జేసెదవుగా?

(ఏదియోపలుకఁబోవ దుర్యోధనుఁడు వారించును)

అశ్వ—కౌరవేంద్రా! వీనినివారించెదవేల? రానిమ్ము; గర్వమును గ్రక్కించెదఁగాక.

ద్రోణు—వత్సా ! నీచునితో నీకీప్రసక్తి యేల?

దుర్యో—గురుపుత్రా ! ఈసమయమున మీకీకలహ మేల?

కృపా—కర్ణా ! అనవసరసంభాషణ మెందుకు ?

భీష్మ—దుర్యోధనా! ఈరాధేయుఁడు కార్యగతి నెఱుఁగఁడు. ఇప్పుడు వచ్చువాఁ డర్జునుఁడనుటకు సందియము లేదు. ఈకర్ణుఁడాతనిని నొంటిఁగ దాకఁజాలఁడు. కావున వీరినిఁ బ్రసన్నులుగాఁ జేసి కాని కర్తవ్యముఁ జూచుకొనుము.

దుర్యో—(అశ్వత్థామ కర్ణులంజూచి) ఆచార్యతనూజా ! ఈసమయమున నీకలహమేల ? (ద్రోణాచార్యునిచూచి)

మ. ఘనబాహాబలశౌర్యమేర్పడ నుద ♦ గ్రక్రోధియై శ్వేతవా
హనుఁడిప్పట్టున వచ్చుచుండెఁ గద ఘో ♦ రాజిన్ ననుం దాఁకఁగా
జను నేయాగతి నూరకుండుట, విపక్ష ♦ సంగ్రామమందుగ్రమహం
దుర్నిపుత్రుల్ జెసకంగ మార్గమును దో ♦ డ్తోచూడగానొప్పదే.

(నిజరూపముతో నర్జునుఁడుత్తరునితోఁ బ్రవేశించును)

అర్జు—ఉత్తరా ! నీయనుమానము తీరినదికదా?

సీ. తరసి చేతమున మీా ♦ తండ్రి సేవించెదు
యా కంకుభట్టైన ధ ♦ ర్మాత్మజుండు
వలలుండుగా నొప్పి ♦ వంటలవాఁడైన
వాఁడె చిన్నన్న యా ♦ వ్వాయుసుతుఁడు
హయశిక్షకుండయి ♦ యవనీశుగొల్చు వా
మగ్రింధియే సుమీా ♦ మానకులుఁడు
గోపాలకుండయి ♦ భూపాలుగొల్చు తం
త్రీపాలుఁడే సహ ♦ దేవుఁ డేన

తే. గీ. యర్జునుండను సైరంధ్రి ♦ యాజ్ఞసేని
యట్లు మీా తండ్రి గొల్చుచు ♦ నలరుచుండె
వరుసగడచితి మజ్ఞాత ♦ వాసదీక్ష
సత్యమును జెప్పితినిఁ కేల ♦ సంశయంబు.

నేను దేవలోకమున కరిగినప్పు డూర్వశియిచ్చిన శాపకారణమునఁ బేడినైతి. ఇదియే గాండివము. ఇయ్యది మహేంద్రుఁడొసంగిన మణికిరీటము.

ఉత్త—మహాత్మా! వందియము వాసితిని. (ఇంచుక యూరకుండి) మా మేనమామయగు కీచకుని జంపినది మీా భీముఁడే యై యుండును.

అర్జు—అవును. అదియుంగాక దుర్యోధనునిచే మా జాడ నెఱుంగుటకు వచ్చినమల్లుని నోడించినదికూడ యాతఁడే; ఉత్తరా! ఇఁకరథము పోనిమ్ము. అదిగో కురుసైన్యము.

ఉత్త—(రథము నడపుచున్నాఁడు.)

అర్జు—రథమాపుము—(చేతితోఁజూపుచు)

తే. గీ. అతఁడు గంగాసుతుఁడు ద్రోణుఁ ♦ డతఁడు కృపుఁడ
తండు ఘటసంభవసుతుఁ డ ♦ తండు వశుల

వెంటనున్న వాఁడదె కురు ♦ విభుఁడు వాని
ప్రక్కనున్న వీరుండె యా ♦ రాధసుతుఁడు.

అదె ద్రోణాచార్యుఁడు మాకందఱకును శస్త్రగురుఁడు. అతనికినాయం దెంతయో ప్రేమ. పితామహుఁడగు గాంగేయుఁడు మమ్ము బాల్యమాదిగఁ బెంచెను. గురుపుత్రుఁడును నేనును సోదరులచందమున నుందుము. కృపుఁడుగూడ మాకాచార్యునివంటివాఁడే (ఇంచుకయూరకుండి) వీరిమొదల నాకు గల గౌరవమును జూపుటకు శరములచేతనే యారాధింతును (కొన్నిశరముల విడిచి) ఉత్తరా! రథమును సుయోధనుఁ డున్నదెసకుఁ బోనిమ్ము?

ఉత్త—ఇదిగో—పోనిచ్చుచున్నాను.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ద్రోణు—(సంతోషముతో) అర్జునా! శిష్యుఁడవన్ననీవే!

ఉ. నీకువిరోధియైన కురు ♦ నేతనుగొల్చుచునున్న సద్గురున్
బ్రాకటభక్తి నీగతి శ ♦ రంబులఁ బూజయొనర్చువాఁడ వా
హా! కడు సంతసించితిని ♦ నందెదుగాక ఫలంబు దీనికో
హో! కురువంశదీప సుగు ♦ ణోజ్జ్వలభూషణ యింద్రనందనా!

(భీష్మునిఁజూచి) గాంగేయా! పార్థునిగురుభక్తిఁ గంటివా?

భీష్మ—ఆచార్యా! అతనిగురుభక్తి వర్ణనాతీతము. (ఇంచుకయూరకుండి) అదుగో! అర్జునుఁడు పశులయొద్దనున్న రారాజుపై కరుగుచున్నాఁడు. దుర్యోధనుఁ డాతనిని మార్కొనఁజాలఁడు.

అశ్వ—రాధేయుఁడుండెనుకదా?

ద్రోణు—అట్లని మనమూరకొనరాదు. మీరిరువురు నరిగి దుర్యోధనునకు బాసటయై నిలువుఁడు.

(కృపాశ్వత్థామలు నిష్క్రమింతురు.)

ద్రోణు—అదిగో! దుర్యోధనునిపైకేగు పార్థుని గర్ణుఁడు దాకినాఁడు.

భీష్మ—ఇరువురును సమర్థులే (పరికించి) అటుచూడుము. కర్ణునతిక్రమించి యర్జునుఁడు దుర్యోధనునిపైకిఁ బోవుచుండఁగా నతని నశ్వత్థామ యడ్డుపడినాఁడు.

ద్రోణు—(చూచి) అవునుగాని, యేకారణముచేతనో, యర్జునుఁడు నాకుమారుని దలపడక యిట్లే వచ్చుచున్నాఁడు?

అర్జు—(ఉత్తరునితోఁ బ్రవేశించి) ఉత్తరా! రథమును మాగురుచరణ సన్నిధికిఁ బోనిమ్ము; (తనలో) నాయెందెంతయో ప్రేమబూని యస్త్రవిద్యావిశారదునిగాఁ జేసినమహానుభావుఁడగు నీతనిపై కెట్లు సమరమునకుఁ బోవుదును?

(ద్రోణునిఁజూచి—ప్రకాశముగా)

తే. గీ. వనములందున బండ్రెండు ♦ వత్సరములు
వాసమొనరించివచ్చిన ♦ ఫల్గునుండు
మీరుపెట్టినదీవంబు ♦ మీకుభక్తి
బ్రణతులర్పింతుఁగొనఁదగుఁ ♦ బరమకృపను.

(నమస్కరించును)

ద్రోణు—పార్థా! నీగురుభక్తికి సంతసించితిని. నీకు శుభంబగుఁగాక! లెమ్ము, సందియమందక యాహవమున మమ్మెదిరింపుము.

అర్జు—గురువర్యా! నీవెంతచెప్పినను నేను తొలుత శరప్రయోగము సేయఁజాలను. అట్లొనర్చితినేని, ధర్మసంధుఁడగు యుధిష్ఠిరుఁడు నాపైనలుగును.

ద్రోణు—నీవినయమునకు మెచ్చితిని. రణోచితస్థలమున కరగుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

భీష్మ—(పరికించి) భళిరా! పార్థా! నీయస్త్రవిద్యానైపుణ్యమును శ్లాఘింపవచ్చును. అస్త్రగురునే మోదించితివి. అశ్వత్థామ శారద్వతులు తెల్లపోయి చూచుచుండిరి. అదిగో! అర్జునుఁ డేమోయనుచున్నాఁడు.

(తెరలో)

మ. ఇదె గోపాలకులార గోసమితితో ♦ నింపారగాఁ బొండు నా
గదియంగ వచ్చుచునున్న కౌరవుల సై ♦ న్యంబెల్ల దున్మాడి మా
స్పదగర్వంబు గురుతమావతికి న ♦ న్వీక్షించి మత్స్యేశ్వరుం
డెదసంతోషమునందఁగానిపుడె నే ♦ నెంతైన శౌర్యంబునన్.

భీష్మ—అర్జునుఁడు; గోవులఁ దోలుకొని పొమ్మని గోపాలకుల కాజ్ఞాపించుచున్నాఁడు.

(అర్జునుఁడుత్తరునితో) బ్రవేశము.)

అర్జు-చ॥ అనిమిషవాహినీ నయము ♦ నాజి నెదిర్చినగాని యానుయో
ధనునిగలంపలేముగద ♦ తాతకుమాయెడ గూర్మియగ్గలం
బని తలపోయఁ జెల్లదు న ♦ యంబును నాతఁడు తప్ప డిప్పుడ
య్యనఘుఁడు, సంశయింపకిఁక ♦ నాజియొనర్ప దొలీరు నుత్తరా.

నెమ్మదిగా రథమాతనిసమీపమునకుఁ బోనిమ్ము,

ఉత్త—(అట్లుసేయును)

భీష్మ—(తనలో) అర్జునుఁడు నాదెసకే వచ్చుచున్నాఁడు. అదిగో! సుయోధనాధులుగూడ నేనర్జునునితో నెట్లుపోరుదునో చూచుటకు కాఁబోలిట్లు వచ్చుచున్నారు.

అర్జు—(భీష్మునిఁజూచి) పితామహా!

చ. అని నొననిన్ను గెల్వఁగ బు ♦ రారికి నైనను శక్యమాన సూ
యనఘచరిత్ర! యట్టియెడ ♦ నాలకునై విరటుండు బంటు బం

ట  నగుచువచ్చినాఁడను, గృ ♦ తఘ్నువిచారణహీనునన్నునుగా
మనమున నెట్లు చూచెదవొ ♦ మన్ననసేయఁగ నిన్ను వేఁడెదన్.

భీష్ము—

చ. హరునెదిరించి పాశుపత ♦ మందితివంచును విన్నదాది భీ
కరరణమందునిన్ను జెన ♦ కంగలయేటి వరాక్రమాఢ్యులుం
ర్వరఁగలరే యటంచెపుడు ♦ భావమునందు దలంచుచుందు
కౄరణిఁగలంచెదో రణము ♦ ఖంబున నన్నిఁకఁ జాతునర్జునా!
రణోచితస్థలమున కరుగుదము రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు)

అశ్వ—(కృపాచార్యునిఁజూచి) మామా ; తాతమనుమలసంగరాద్ధ
త్యముచూచుచుంటివా? ఒకరికొకరు తీసిపోవుటలేదు.

కృపా—ఇరువురును సమానులే. ఇందొకఁడు హరినిగెలిచినాఁడు. వే
రొకఁడు హరునెదిరించినాఁడు.

ద్రోణు—అదిగో! అర్జునుఁడు భీష్మునతిక్రమించి యిట్లు వచ్చుచు
న్నాఁడు.

(ఉత్తరునితో నర్జునుఁడు—ప్రవేశించును)

అరు—ఉత్తరా! ఇంకఁగురుపతి మనకుఁజిక్కినట్లే. (చేతితోఁజూపుచు)
ఈకురుకులపాంసనుఁడే బాల్యమునుండియు మాకెన్నో సిలు
గులఁ గల్పించుచున్నాఁడు.

ఉ. ఈతనితోడ మాకు రణ ♦ మిప్పటికిన్ లభియించెఁ గౌరవ
వ్రాతము భీతినొంది పడి ♦ పారఁగ దుర్మదు వీనిఁ దాఁకి; వి
ఖ్యాతినిగాంతు న య్యమరు ♦ లద్భుతమందినుతించునట్లు నా
కీతనితో రణంబనిన ♦ నెంతయుఁ బండువయౌనునుత్తరా.

(దుర్యోధనునిఁజూచి) దుర్యోధనా!

మ. నిను నే జంపెదనంచు భీతిగనుచున్ ♦ దిచ్చేసితే యిట్లు నీ
వనుమానింపగనేల దానికొఱకై ♦ యీనాఁడు నిన్ గూల్చగా
ఘనబాహాబలశాలి భీముఁడు ప్రతి ♦ జ్ఞం జేసియున్నాఁడు కా
వున నిన్నున్ వధియింపఁజాడను నిక్కన్ ♦ పోపొమ్ము దుర్యోధనా!

దుర్యో—(తలవాల్చి నిలుచును)

(భీష్మాదులు మరల యుద్ధసన్నద్ధులై శరప్రయోగము సేయుదురు.)

అర్జు—(తనలో) వీరిని సమ్మోహనాస్త్రమున మూర్ఛపుచ్చెదఁగాక!
(ధ్యానము నటించి శరప్రయోగము సేయును)
(అందఱు మూర్ఛనటింతురు)

అర్జు—ఉత్తరా! నీసహోదరియగు నుత్తరకోరిక ననుసరించి వారి యుష్ణీషాంచలముల నుత్తరించి తెమ్ము; మదీయమోహనాస్త్రమునకుఁ బ్రతి గాంగేయుఁడెఱుఁగును; కావున నతనిదెసకుఁ బోవలదు.

ఉత్త—మంచిది. (కౌరవయోధుల తలపాగాలు తెచ్చును)

అర్జు—ఇఁక బోవుదము రమ్ము. రమ్ము.)

భీష్మ—(లేచి) అవురా! పార్థా! ఎంతపని జేసితివి; (సుయోధనుని జూచి) కురురాజకుత్తుక నుత్తరించెనని యే తలఁచితిని. కాని యాతఁడట్లు సేయలేదు; అర్జునా! ధర్మజనిత మ్ముఁడవనఁ జెల్లును

దుర్యో—(లేచి) అర్జునా! నిలువుము.

భీష్మ—సుయోధనా! తొందరపడకుము; అర్జునుఁడు ధర్మమూర్తి యగుటచే మనలను ప్రాణములతో విడిచినాఁడు; ఇదిచాలును; పోవుదము రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

రంగము:-[విరటునిమందిరము:-విరటుఁడును-ధర్మరాజు(కంకుభట్టు)ను వినోదార్థము జూదమాడుచుందురు]

విర—ఆర్యా! కంకుభట్టారకా! నాకుమారుఁడు బృహన్నలను సారధిగాఁ జేసికొని, కురువీరులతోఁ బోరి మనగోగణమును మరలించుకొనివచ్చుటకరిగెనని విని యుంటివిగదా! అతఁడింకను రాలేదేమి కారణమో! నాచిత్తము పరిపరివిధములఁ బోవుచున్నది. కౌరవవీరులుకుమారున కేమియెగ్గు పలికిరో తోచకున్నది.

ధర్మ—రాజేంద్రా! నీవు కుమారునివిషయమై చింతింప నవసరములేదు. అతనికి సారధియైయున్న బృహన్నల సామాన్యుఁడు కాడు. రథసారథ్యమునందెట్టినైపుణ్యమున్నదో యుద్ధము సేయుటయందుఁగూడనట్లేయున్నది; బృహన్నలప్రక్కనుండఁగా నుత్తరుని తేరిచూచుటకుఁ బురహరునకైనను దరముకాదు.

(గోపాలకుఁడు—ప్రవేశించును)

గోపా—మహారాజా! జయముజయము.

విర—ఏమిరా వార్తలు?

గోపా—మహాప్రభూ! కౌరవులచే బంధింపఁబడిన గోవులను మరలించుకొని మనయుత్తరకుమారుఁడు వచ్చుచున్నాఁడు.

విర—ఏమీ! కుమారుఁడు జయముగాంచియే వచ్చుచున్నాఁడా? అతనికిని గౌరవసైన్యమునకును బోరాటముజరిగినదా;

గోపా—దేవా! నే నసత్యము పలుకుదునా? గొప్పయుద్ధమేజరిగినది. మనవారే గెలిచిరి.

విర—సంతోషము-సరే! నీవరుగుము (ఉత్తరునుద్దేశించి)

మ. పదియారేడులబాలకుండ వరరే ♦ బాహాబలప్రౌఢి దు
ర్మదుఁడై యట్లరుదెంచి గోవులఁ గురు ♦ క్ష్మాభర్త బంధింపఁగా